

(మోడలు ఎ-730)

# ఎంచుకొందుకు వీలుగా సొగసైన వివిధ మోడలుల

# నేషనల్ ఎక్కో రేడియోలు

నేషనల్-ఎక్కో రేడియోల వివిధ మోడలులలో ఒకటి మీకు తప్పకుండా నచ్చుతుంది! నేషనల్-ఎక్కో రేడియో ఏదైనా శ్రేష్టమైనది; అద్భుతముగా పనిచేస్తుంది; అది గంటలతరబడి వినోదకార్యక్రమములను అందచేస్తుంది. దానిని ఏళ్లతరబడి విని ఆనందించగలరు.

నేషనల్-ఎక్కో రేడియోలు 10 అద్భుతమైన మోడలులలో కలవు. వాటి ధర రు. 125.00 అంతే తక్కువనుండి రు. 725.00 వరకు కలదు.



మోడలు యు-764: ఎసి/డిసి సెట్. 5 వాల్వులు, 3 బ్యాండులు. అందమైన క్యాబినెట్. మోడలు బి-764: డ్రై బ్యాటరీ సెట్. 5 వాల్వులు. 3 బ్యాండులు. రు. 265



మోడలు యు-755: ఎసి/డిసి సెట్. 6 'నోవల్' వాల్వులు. 3 బ్యాండులు. కట్టు క్యాబినెట్. మోడలు బి-755: డ్రై బ్యాటరీ సెట్. 5 'నోవల్' వాల్వులు. 3 బ్యాండులు. కట్టు క్యాబినెట్. రు. 355



మోడలు యు-759 (జనత): ఎసి/డిసి సెట్. వాల్వులు మరియు రెక్టిఫైయర్, 2 బ్యాండులు: మీడియమ్ మరియు షార్ట్‌వేవ్. సొగసైన క్యాబినెట్.

రు. 125

మోడలు ఎ-744: ఎసి సెట్. 9 విధములుగా పనిచేసే 6 'నోవల్' వాల్వులు. 4 బ్యాండులు. అందమైన క్యాబినెట్.
మోడలు బి-751: డ్రై బ్యాటరీ సెట్. మొత్తము 9 విధములుగా పనిచేసే 3 ట్రాన్సిస్టర్లు మరియు 4 వాల్వులు. 4 బ్యాండులు. అందమైన క్యాబినెట్. రు. 405



మోడలు ఎ-730: ఎసి సెట్. 9 విధములుగా పనిచేసే 6 'నోవల్' వాల్వులు. 8 బ్యాండులు. కట్టు క్యాబినెట్. మోడలు యు-730: ఎసి/డిసి సెట్. రు. 570

నేషనల్-ఎక్కో రేడియోలు శ్రేష్టమైనవి... అవి 'మాన్‌సూనైజ్' చేయబడినవి

అన్నిధరలూ ఎక్సైజ్ డ్యూటీతో. పన్నులు అదనము



జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్
బొంబాయి . కలకత్తా . మద్రాసు . ఢిల్లీ . పాట్నా . బెంగుళూరు . సికిందరాబాదు

IWT-GRA 3470

# ఉత్తరాలు

## ఎప్పుడూ ఇంతే

8—6—62 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రికలో శంకర్‌గారి ఎప్పుడూ ఇంతే ముక్కుకు గారెలు చెక్కుట సాధ్యమగునా అని మిమ్ములను ప్రశ్నించుచున్నాను

ఆర్ రాజారెడ్డి (ముళబాగలు)

* * *

8—6—62 సంచికలో శంకర్‌గారి కార్టూన్ అంత బాగాలేదు. రెండు గారెలు సునాయాసముగా ముక్కున తగిలించుకోగలిగిన పొడవైన ముక్కుగల మనుష్యులు అరుదేమో ?

రవికుమార్ (అయభీమవరం)

## చదువుల్రావు

ఏమండోయ్ శ్రీకాట్రగడ్డ సుబ్బా..రా..వుగారు మీరు అంత ఇదిగా నన్ను 'చదువుల్రావు' 'బొమ్మల్రావు' అని సంబోధించడం 'హైలీ అబ్జక్షనబుల్ అండ్ కన్‌డెమ్‌నబుల్లీడోయ్'!

సత్యమూర్తి (హైదరాబాద్)

## సరాగమాల

"ఆరాధన" చిత్రంలో ఘంటసాల వెంకటేశ్వరరావుగారు పాడేపాట 'నాహృదయంలో నిదురించే చెలీ'లో కొన్ని దిద్దుబాట్లు కలవు. వ్రాసిన పాట ఒకరీతిన ఉంటే పాడేపాట మరోరీతిగా ఉంది 'నా గానములో నీవే .... ప్రాణముగా పరిమళించినావే' అని పాటలపుస్తకములో ఉంటే రికార్డులో 'పులకరించినావే' అని ఉంది.

'నివాళితో నిదురకాచి — ఎదురుచూచినావే ఎడదదాచినావే' అని పుస్తకంలో ఉంటే రికార్డులో నివాళ్లితో నిదురకాచి చేయిచాచినావే నిదురకాచినావే' అనిఉంది. ఇది చాలా విచిత్రంగా ఉంది.

రావెల పురుషోత్తమరావు (రావెల)

## సందేహం

15—6—62 పత్రికలో "ఉత్తరాల" శీర్షికలో కవులూరు దశరథరామయ్య (హైదరాబాదు)గారి ఉత్తరానికి మీరు జవాబు ఇవ్వలేదు. వారు "వనితావాణి" శీర్షికలో ప్రతివారం ముద్రించే కవరుపై ధర్మవరము పోస్టాఫీసు ముద్రమాత్రమే ఉంటమువలన, ఆ ఉత్తరం ఇంతవరకూ చేరలేదా? అని అడిగారు.

మద్రాసు పోస్టుముద్ర కవరుకు రెండవపక్క ఉంటుందని వారెందుకు ఊహించలేదో ..... ? ఒక్కొక్కసారి రెండుముద్రలు కవరుకు ఒకవైపునే కాకుండా రెండుప్రక్కలా వేర్వేరుగా వేస్తారు కనుక 'మద్రాసు' పోస్టాఫీసు ముద్రలేకుండా ఉత్తరాలు చేరుతాయన్నది పొరపాటనుకుంటాను!

సంకురాత్రి శ్రీనివాసరావు (రాజమండ్రి)

* * *

ఆంధ్రసచిత్రవారపత్రికలోని 'ఉత్తరాలు'శీర్షిక చూస్తూవుంటే ఒక అనుమానం కలుగుతుంది. [illegible] పత్రికలో ప్రచురించబడిన తక్షణం, ఆ రచయితే ఆరడజను ఉత్తరాలు రకరకాలపేర్లతో (ముఖ్యంగా కుమారి ఫలానా అన్న ఆడపిల్లల పేర్లతో) మీ పత్రికకు పోస్టు చేస్తున్నారని అనుమానంగా వుంది. ఎందుకంటే ఏ కథనైనా, బ్రహ్మాండంగావుందని ఉత్తరాలు వ్రాస్తున్నారు. ఈ పదేళ్లల్లో (!) ఇంతటి ఉత్తమోత్తమమైన కథను చదవలేదని, ఆ రచయిత మార్కు కథలనే (జీడిలా విడవకుండా) ఎల్లప్పుడూ ప్రచురించండి, లేదా ఆరచయిత ఇంకా ఏమైనా కథలు రాశాడా అని!

కె. సదానందశర్మ (ఖర్గపురం)

## హాయవాతా

మీరు ప్రచురిస్తున్న "హాయవాతా హద్భుత గాథ" చాలాబాగున్నది. మాలాటి పిల్లలకి చాలా బావుంది. అందులో హైవాతా పడమటగాలి వద్దకు వెళ్లినపుడు పడమటిగాలి చెట్లు పెరుకుతున్నప్పుడు హాయవాతా భయపడ్డాడు కదా నాకుచాలా భయంగావుంది. కానీ మా అక్క చంపడని అంటోంది. కానీ నాకుచాలా భయంగా వుంది. ఏమవుతుందో తప్పకుండా చెప్తారు కదూ ?

బి. పద్మకుమారి (అంబాజీపేట)

## కథ

ఇందిరగారు వ్రాసిన 'తొలకరివానలు' కథ బాగానేవుంది. కాని మొదట శ్రీహరి, శ్యామల స్టేషన్‌నుండి వస్తున్నప్పుడు 'చుట్టూ ఎటుచూసినా పచ్చనిచేలునండి, తలలు ఊపుతున్నాయి' అని వ్రాశారు. వాళ్లు ఇల్లుచేరిన తరువాత రాత్రి 'ఆకాశంలో మబ్బులున్నాయండి' అని శ్యామల అడుగగా 'అవును మబ్బులుంటాయి. వర్షం కూడా రావచ్చు. ఈ మే, జూన్ నెలల్లోనే తొలకరి వానలు పడతాయి—' అని శ్రీహరి జవాబిస్తాడు. వానలు పడకముందే పొలాల్లో పచ్చనిచేలు ఎలా ఉంటాయో ఆశ్చర్యంగా ఉంది. 'మే' నెలవరకే సామాన్యంగా వరిచేలు కూడాకోస్తారు. కనుక ఈ విషయములో ఇందిరగారు పొరబడ్డారని భావించుచున్నాను.

యస్. రఘునందన్‌గౌడ్ (కాకువంగ)

## సీరియల్ కథ

8—6—62 తారీకు పత్రికలో వీరాజీగారి 'విడీవిడని చిక్కులు'లో 'సూర్యాన్ని అరక్షణం కనుబొమలెగరవేసి వీక్షించి తిరిగి, 'కీబోర్డు' 'ఫెడేలుమనిలాగి తనపనిలో మునిగిపోయింది కొత్త పిల్ల' అని వ్రాశారే కీబోర్డుని లాగటమనేది తప్పుకాదా! కీబోర్డులాగుట ఎలా సాధ్యపడుతుంది? ఎవరైనా కారేజీలాగుతారుగాని? నాకువచ్చిన ఈ 'విడీవిడని చిక్కుని విడదీస్తారా!

జి. వి. కె. సత్యనారాయణమూర్తి (ఏలూరు)

★

## తెలుగు పత్రికలన్నింటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 22—6—62
సంపుటము : 54 సంచిక : 42
శుభ॥ సం॥ జ్యేష్ఠమాసం॥ బ॥ పంచమి
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

★




ముఖచిత్రం :
శ్రీ వి. వి. సత్యమూర్తి

## మనలో మాట

ఈ సంచికతో ప్రారంభించిన ఎఫ్. బి. ఐ. కథలకు బొమ్మలు వేసినవారి పేరు బిల్ గిల్ మార్టిన్. ఈ బొమ్మలు 'న్యూయార్క్ మిర్రర్' పత్రికలో పడ్డాయి.

* * *

ఈమధ్య వనితావాణి ఉత్తరాలు ఎక్కువగా వస్తున్నాయి. కారణం తెలియడంలేదు! వీలైనన్ని వేస్తున్నాము కాని రచయిత్రులు ఈ క్రింది విషయాలు పాటించగోరుతున్నాము: 1. ఉత్తరాలు క్లుప్తంగా వ్రాయటం, 2. పేరు వగైరా ఇంగ్లీషులో వ్రాయకపోవటం, 3. ఒక ఉత్తరానికి ఒకవిషయం మాత్రమే చర్చించటం!

* * *

'హామేషా తమాషా' రెండు పేజీలు చెయ్యడం పాఠకులు గమనించే ఉంటారు. ఈ శీర్షికకు ఎక్కువగా పద్యాలు, గేయాలుమాత్రమే వస్తున్నాయి. రచయిత(త్రు)లుకొత్త రకం రచనలు చెయ్యాలని ప్రయత్నిస్తే ఈశీర్షిక ఇంకా బాగుంటుంది!

* * *

'వెండిమబ్బు' రచయిత్రి శ్రీశ్రీ గారి కథ 'ఆకర్షణ' (అనువాదం. 'శర్వాణి') 2-3-'62 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వేశాము. ఆకథమీద చాలా ఉత్తరాలు వచ్చినట్లు మాకు జ్ఞాపకం.

## లోకంపోకడ



"దేవుడు దయవల్ల మొరార్జీగారు నాలుగుకాలాలపాటు చల్లగా ఉండాలి. దిగుమతులు తగ్గించాలని వారుచేసిన నిర్ణయం ఎంతబావుంది! విదేశాలనుంచి దొంగతనంగా మనం తెప్పించుకున్న వస్తువుల వ్యాపారం బ్రహ్మాండంగా సాగుతుంది."

## విషయానుక్రమణిక


కాంగ్రెసులోని పొగరు బోతు
వృషభాలను లొంగతీయడానికి
సంజీవయ్యయత్నం


ముఠాతత్వం
కులతత్వం
ప్రాంతీయ దురభిమానం












చూశారా! భారత దేశం ఎంత అక్రమంగా ప్రవర్తిస్తోందో! సంప్రతింపులకు రమ్మంటే రారే!



శ్రీ దామోదరం సంజీవయ్య కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికయ్యాక రాజఘాట్ లో గాంధీజీ సమాధిమీద పుష్పగుచ్ఛం ఉంచారు.

# జాతి సమైక్యతాసాధనకు బూటకపు ప్రయత్నాలు : ఉప నాయకత్వం కీచులాటలో కొత్త అధ్యాయం

**శ్రీ కృష్ణ**

ఢిల్లీలో ఈ వారం రకరకాల సంఘటనలు తటస్థించాయి. జాతీయ సమైక్యతాసంఘం, అఖిల భారత కాంగ్రెసు సంఘం ఇక్కడ సమావేశమయ్యాయి. రక్షణశాఖ పద్దులపై పార్లమెంటులో జరిగిన చర్చ, ఉపనాయకత్వంకోసం ప్రారంభమైన కుమ్ములాట, విదేశీ మారకం చిక్కులు ముఖ్యంగా పేర్కొనదగినవి.

భారత రిపబ్లిక్ అవతరించి పదమూడేళ్లయింది. 1946 నుంచి అప్రతిహతంగా నిలబడి సాగిస్తున్న కాంగ్రెసుపార్టీ ఈనాటికి దేశం ఛిన్నాభిన్నం అవుతున్నదనీ, జాతి సమైక్యతా పరిరక్షణకు అఖిలపక్ష సహకారం అవసరమనీ గుర్తించింది. విదేశాలలో ఒక సంఘం ఏర్పడిందంటే కార్యాచరణ ప్రారంభమైనదని అర్థం. కాని, మనదేశంలో కార్యాచరణకు బదులుగా సంఘాలు ఏర్పాటవుతూ ఉంటాయి. కనుకనే జాతీయ సమైక్యతా మహాసభ రకరకాల సంఘాలు నియమించాలని—మత సంస్థల వ్యవహారాలు పరిశీలించే సంఘంకూడా వీటిలో ఒకటి—నిర్ణయించటంలో ఆశ్చర్యమేమీలేదు. హిందూ, సిక్ మత సంస్థలపై కాంగ్రెసు నాయకులు కత్తికట్టటం అవసవ్యమని ఎవరూ అనరు. కాని, వేరొక వంక ముస్లిం మత సంస్థలు భారతీయ ముస్లింలకు ప్రాతినిధ్యం వహిస్తున్నట్టుగా గుర్తింపు పొందాలి.

జాతీయ సమైక్యతా మహాసభలో పత్రికల ప్రస్తావన కూడా వచ్చింది. పత్రికలు అనుసరించదగు నిబంధనావళిని రూపొందించవలసిందని మహాసభను కోరటం జరిగింది. ఇక్కడ కూడా మత సంస్థలవల్లనే ప్రధానమైన ప్రతిబంధకం ఎదురవుతోంది. కొన్ని పత్రికలు మతసంస్థల యాజమాన్యం క్రిందనో, ఆసంస్థల ఆశయాల ప్రచార కోసమో వెలువడుతున్నాయి. ముస్లిం మతసంస్థల తాలూకు పత్రికలజోలికి పోవడమంటే ప్రభుత్వానికి భయం కాబట్టి, హిందూ, సిక్కు మత సంస్థల తాలూకు పత్రికల విషయంలోకూడా కరుకుగా వ్యవహరించలేదు. నిబంధనావళిని రూపొందించటం చేతకాని ప్రభుత్వం చేయవలసిన చివరిపని. ఇక్కడ మరొక చిక్కు కనిపిస్తోంది. కేంద్ర ప్రభుత్వ యాజమాన్యంలోఉన్న హిందూ, ముస్లిం విశ్వ విద్యాలయాల పేర్లు మార్చాలని చాలాకాలంగా ఒక ఆలోచన ఉన్నది. కాని భారతదేశం హృదయ స్థానంలో అలీఘర్ విశ్వ విద్యాలయం చిన్నసైజు పాకిస్తాన్‌గా ఉన్నంతకాలం హిందూ విశ్వ విద్యాలయంపేరు మార్చే ప్రయత్నం సాగిరాదు.

మహాసభ హిందీ ప్రచారోద్యమం తీవ్రతరం కాగలదన్న భావాన్ని బలపరిచింది. మరొక వంక దక్షిణాదిన ప్రారంభమైన దేశ విభజనోద్యమాన్ని ఖండించటం జరిగింది. అయితే దాక్షిణాత్యులు భారత సమాఖ్యనుంచి ఎందువల్ల విడిపడాలని అనుకుంటున్నారో పరిశీలించే ప్రయత్నం మాత్రం జరగలేదు. ఆ పరిశీలనే జరిగి ఉన్నట్లయితే హిందీ భాషను బలవంతంగా రుద్దటానికి జరిగిన ప్రయత్నం ఈ వివరిణానికి ఒక కారణంగా కనిపించేది. స్వాతంత్ర్యం సిద్ధించకముందు మహాత్మా గాంధీ ఉత్తరాదినాయకత్వంవల్ల హిందూస్థానీ నేర్చుకోవాలన్న ఉద్యమం దక్షిణదేశంలో ప్రబలంగాఉండేది. ఈ ఆసక్తి కేవలం నచ్చచెప్పటంవల్ల కలిగిందే కాని, బలవంతంగా రుద్దినందువల్ల వచ్చిందికాదు. ఇప్పుడు ఇంగ్లీషులోఉన్న ప్రభుత్వ పత్రాలను హిందీలోకి అనువదించడానికి సుమారు పదివేల ఉద్యోగాలు సృష్టించారని ఇంతకుమునుపు ఒకసారి నేను మనవి చేశాను. అంటే హిందీ రానివారికి ఈ ఉద్యోగాలలో వాటా నిరాకరించారన్నమాటేగదా! మరి వారికి ఆగ్రహం కలిగిందంటే ఆశ్చర్యమేముంది.

ఇక కులాభిమానం, ప్రాంతీయాభిమానం సంగతి. కులతత్వాన్ని, ప్రాంతీయ దురభిమానాన్ని నాశనం చేసి, పిసలైన జాతీయతను రూపొందిస్తున్నామని చెబుతూ, బూటకపు ప్రయత్నాలు చేసినంత మాత్రంచేత జాతి సమైక్యత సాధ్యంకాదు. ఇందుకు కొన్ని గట్టి చర్యలు అవసరం. ఉదాహరణకు ఎన్నికలలో జరిగిన అక్రమాలను పరిశీలించడానికి—ముఖ్యంగా బీహార్‌లో—నిష్పాక్షికమైన ఒక సంఘాన్ని నియమించి, కులంపేరు చెప్పుకుని ఎన్నికలలో గెలుపొందిన కాంగ్రెసువాదులను, సంస్థనుంచి బహిష్క

— 63వ పేజీ చూడండి

నా జీవితంలో మధురక్షణాలన్నీ గడిచి పోయాయి. నాకిక ఈ దుర్భర, దుస్సహ, దుఃఖమయ జీవితాన్ని అంతమొందించటంకన్నాగత్యంతరం కన్పించటంలేదు. నా ప్రేమను అపార్థంచేసుకున్న నా ప్రేయసి వద్ద అంతిమవీడ్కోలు తీసుకొంటున్నాను. నా హృదయం విదారంతో బరువెక్కిపోయింది. నేను నా చావును ధైర్యంగా ఎదుర్కోదల్చుకున్నాను. నా చావుకి........" అని, అంత వరకూ తను రాసినఉత్తరాన్ని కైలాసరావుకు విన్పిస్తున్న అతని మేనల్లుడు శ్యామలరావు ఆగాడు. కొద్దిగా గొంతుక సరిచేసుకున్నాడు.

"ఇక్కడే సంది నా కావాలి మామయ్యా! అయినా ఆత్మహత్య చేసుకోబోయేవాడు. నా చావుకి ఎవరూబాధ్యులు కారు అని రాయాలా? అక్కర్లేదా? లా ప్రకారంఅవసరమా? లేదా? ఈ కాస్త పాయింటూతేల్చే సేవంటే, ఇహ నేనువెళ్ళి ఆత్మహత్య చేసేవ





కుంటాను" అన్నాడు ఇరవై రెండేళ్ల శ్యామలరావు. తను ప్రేమించిన కమల తనను నిరాకరించడం వలన కలిగిన విచారాన్ని భరించలేక, ఆత్మహత్యా ప్రయత్నాలను చేస్తూ.

కైలాసరావు రాజమండ్రీలో పేరుపొందిన వకీలు. వయస్సు ఏభైఅయిదేళ్లు దాటాయి. ఎర్రగా, లావుగా, పొట్టిగా ఉంటాడు. మెరిసే బట్టతలా, గుండ్రటి చిన్నబొజ్జా, నిరంతరం సిగరెట్టుకాల్చడం అతని ప్రత్యేకతలు. మేనల్లుడు శ్యామలరావు అంటే అతనికి చాలా అభిమానం.

శ్యామలరావు, తను జీవితంలో ఏ సమస్యను ఎదుర్కోవలసివచ్చినా, మామయ్యను విధిగా సలహా అడుగుతాడు. సన్నగా, పొడుగ్గా, ఎర్రగావుండి, నొక్కు నొక్కుల జుత్తూ, అందమైన కళ్లూ, ఆకర్షణీయమైన మొహంకల శ్యామలరావు ఇప్పుడు చాలా విచారంగా, దిగులుగా టైఫాయిడ్‌పడిలేచిన పేషంటులాగ, రోడ్ల దుమ్ముపులుముకొన్న బట్టలతో, కొన్నిరోజులనుంచి రేజర్‌స్పర్శ ఎరుగనిగడ్డంతో కైలాసరావుముందు ప్రత్యక్షమయ్యాడు.

తన ఈస్థితికి కారణం, తను ప్రేమించిన కమల తను మద్రాసులో వేరొక అమ్మాయితో స్నేహంగా తిరగడం తెలుసుకొని, తన వంచకస్వభావం మీదా, మొత్తం పురుషజాతియొక్క ద్రోహబుద్ధిమీదా ఒక థీసిస్‌లాంటిది రాసి తనకుపంపడం, అది చదువుకొని తను రాజమండ్రీ పరిగెత్తుకువచ్చి కమల ఇంటికి వెళ్తే, ఆమె తనతో మాట్లాడడంమానేసి, తన మరొక స్నేహితురాలిద్వారా ఆమెకూ, తనకూ ఏమీ సంబంధంలేదని కబురుపెట్టడం, దాంతో తనూ విఫలప్రేమికు లందరిలాగే ఆత్మహత్యకు పూనుకోవడం—అని కైలాసరావుకు చెప్పాడు.

జీవితంలో ఏపని చెయ్యాలన్నా లాయరు సలహా అవసరం. అందువలన శ్యామలరావు ఎలాగూ తను ఆత్మహత్య చేసుకోదల్చాడు కాబట్టి, ఒక అంతిమలేఖ అంటే చివరి సందేశంలాంటిది—అనగా తుదిపలుకూ అని కూడా అనుకోవచ్చు, రాయదల్చుకున్నాడు. అందులో తన నిజాయితీ ఋజువు కావాలి. లోకం, ముఖ్యంగా కమల తన నర్థం చేసుకోవాలి. ముఖ్యంగా తను ప్రేమలో విఫలతచెంది, ఈ ఆత్మహత్యాప్రయత్నాని కుపక్రమించినట్లు అందరికీ తెలియాలి. అందుకోసం మామయ్య సలహాకోరి వచ్చాడు.

—52 వ పేజీ చూడండి



# ప్రపంచ ప్రముఖులు-3

క్రీస్తుపూర్వం ఆరవశతాబ్దం నుంచి ఇరవైయవ శతాబ్దం వరకూ ఈజిప్టు విదేశీపాలకుల క్రిందనే ఉంది. ఈజిప్టు ప్రపంచంలోని బీద దేశాలలో ఒకటి. ప్రజల ఆరోగ్య స్థితి ఏమాత్రం బాగుండనిది. జన సంఖ్య విపరీతంగా పెరుగుతోంది కాబట్టి సుమారు 1972 ప్రాంతాలలో పూర్తికానున్న ఆస్వాన్ ఆనకట్ట మూలంగా కలుగుతాయనుకున్న లాభాలు కూడా అప్పటికి తగ్గిపోతాయి.

ఇంత వెనుకబడినదేశం అరబ్బురాజ్యాలన్నిటికీ నాయకత్వంవహించటానికి ముఖ్య కారణం గమాల్ అబ్దుల్ నాసర్. ఇస్రాయల్ తో వైరం ఈ రాజ్యాలన్నిటినీ కలిపినా నాయకుడు నాసరేనని నిస్సందేహంగా చెప్పవచ్చు. అల్జీరియాలో స్వాతంత్ర్యసమరానికి ఈజిప్టు చాలా సహాయపడింది.

కాని అరబ్బురాజ్యాలమధ్య ఐకమత్యం క్రమంగా తగ్గిపోవటం నేడు బాగా కనిపిస్తోంది. సిరియా విడిపోయింది. ఎప్పుడూ ఈజిప్టుకి వ్యతిరేకంగావున్న ఇరాక్ కాసిం అధికారంలోకి వచ్చిన తర్వాతకూడా వ్యతిరేకంగానే ఉంది. అల్జీరియా స్వతంత్రదేశం అయినపిమ్మట ఈజిప్టుకి దూరంఅవకతప్పదు.

ఈ ధోరణి మారాలంటే ఈజిప్టు తన విధానాలుకొన్నిటిని మార్చుకోవలసివస్తుంది. ఇస్రాయిల్ తో ఏదో విధంగా సంధి ఏర్పరచుకుని, తక్కిన అరబ్బురాజ్యాలమీద అధికారం ఉన్నట్లు ప్రవర్తించడం మానుకోవడం మంచిది.

నాసర్ గొప్ప 'మేధావి'(Intellectual) కాకపోయినా 'సాంఘిక రాజకీయ విప్లవాలు' రెండూ ఒకేసారి జరపవలసిన బాధ్యత తనమీద కలిగిందని గుర్తించి స్పష్టంగా చెప్పారు. వీరి నాయకత్వంక్రింద ఈ బాధ్యత నెరవేరుతుందని ఆశించవచ్చు.

నాసర్ ఏమాత్రం ఆడంబరంలేని మనిషి. మహమ్మదీయమతం నిషేధించింది కనుక మద్యపానం చెయ్యరు. కాని, మతం విషయంలో తీవ్రవాదికాదని ఆయన ప్రభుత్వం అమలులోకి తెస్తున్న సంఘ సంస్కరణలూ, కార్మికమీద ఇటీవల ఈజిప్టు చేసిన ప్రకటన నిరూపిస్తాయి. ★

# హరివంశము

హారీత శివశర్మ

## సాందీపని పర్వం-63

పౌండ్రకుడు అంతకోపముతోనను తానుగూడ నవ్వెను. నవ్వి ఇట్లులనెను:

"మాతలి! నేనన్న నీకు భయములేదు. గౌరవమును లేదువలె వున్నది."

అందరును అతని ఆ మాటలను విని ఆయన నేడు మాతలి నేమియో చేయుననుకొన్నారు. ఎందుచేతననగా ఆయనకోప మట్లులున్నది. ఆ కోపముతోడి నవ్వుగూడ అట్లులున్నది. ఒక వ్యక్తికి కోపములో నవ్వు వచ్చినప్పుడు ఆకోపము విశ్వధమగుట. యుండునుగుట పౌండ్రకుని ఈ నవ్వు అట్లు లేదు. ఆయనకు మాతలిమాటలవలనవచ్చిన కోపమునకు శిఖరాయమాణముగ నున్నది సాయంసూర్యుని వేడి తగ్గిన కిరణములు హఠాత్తుగానాచల్లబడిన వేడిమికి ప్రాణమును పోసికొన్నట్లులున్నది. మాతలి భయపడలేదు. రాజు తన్నేమియో చేయునని అనుకొన్న జాడగూడ అతనిలో కన్పించుట లేదు. అతడును మెల్లన హసించి రాజుతో ఇట్లులనెను.

"మహారాజ! తామన్న నేనేల భయపడవలయును. దారుకుని నేటి సారధ్యము నాకు నిజముగా భయమును కల్పనచేసినది. ఆ భయము నన్నుగూర్చికాదు. దారుక స్వామిని గురించి. మరియు అంతలో కల్గిన ఆ భయము అంతలో విరిసిపోయినది. నాకును—భయమన్న వస్తువు అర్థమైనట్లు అవభాసించినది. నాకును భయము పోయినది. మహారాజ! తమకు నేను జరిగినవృత్తాంతమును చెప్పుదునన్నాను. తాము చెప్పమన్నారు. నేను చెప్పుచున్నాను. అంతలో తాము కోపగించిన నేమిలాభము. అంతయు వినినతరువాత నేనవిన మాటల యర్థముపొడగట్టవచ్చును. మరియు మహారాజా! ఒక్కమాట చెప్పవుందురా! నేను తమ్ము చూచి భయపడవలయునని మీకు కల్గిన భావము ఇప్పటిది. అనగా తమరు భయపడుచున్నారు. ఆ భయమును ఈ విధముగా వెల్లడించుచున్నారు. భయము ఎందునుగురించి కల్గుచున్నదో, అందునుగురించిన అవబోధములేమివలన భయము కల్గుచున్నది. దారుక స్వామి రథము నట్టులు తోలగా, నందునుగురించిన అభిజ్ఞానములేక నేను భయపడితిని. ఆయన ఎరుకతోడి నారథమునట్టులు తోలి లోకాద్భుతమైన సాహసమును నాకు ప్రదర్శించి నన్ను అనుగ్రహించెననగా నాకును ఎరుకకల్గి ఆకల్గిన భయము పోయినది. భయము అవిజ్ఞాత హేతుహేతుకము. ఆ హేతువు విజ్ఞాతముకాగా భయము పోవును. మహారాజా! నాకు అట్టులైనది!'

"ఎట్టులైనది" అనినాడు పౌండ్రకుడు అతనిలోనను ఇప్పుడు కౌతుకము కన్పించుచున్నది. మాతలి ఏమిచెప్పునో వినవలయునని యున్నది. మాతలిరథసారథ్య విద్యలో ఆరితేరినవాడు. కులక్రమాగతముగ వచ్చినవిద్య అది. అతని తండ్రిని గురించి కాశికలో నిప్పటికిని చెప్పుకొనుచుందురు, అంతటి సారధిలేడని, అశ్వహృదయము నెరిగి రథమును నడిపించినవాడు లేడని. మరియు మాతలి పెద్దవాడుకాగా, వాని వగ్గములనుబట్టి రథమును తోలగా, వీడు తండ్రికి మించినవాడనివారు కాశికలోనివారందరును. ఇప్పుడా మాతలియే దారుకుని పొగడుచున్నాడు. వాడు పట్టిన పొగడునా!

"మాతలి! నీ వేల నేను పంపిన కార్యమును సాధించుకొని రాలేక పోయితివిరా!" అనినాడు.

మాతలికి నవ్వువచ్చినది. వాడు గల్లున నవ్వినాడు. "మహారాజ! అంత వక్రోక్తియేల! మాతలి దారుకునిగూర్చి చెప్పుమురా!' అనరాదా! మీరన్న నాకు గౌరవము ఇక్కడనే మహారాజ! తమరు విరోధిపక్షములోనివాని గొప్పతనమును గూర్చి విందురు. విని ఆనందింతురు. ఆ ఆనందము బయటికి పొక్కనీయకపోవుటగూడా తమగొప్పతనము లక్షణము." అనినాడు.

పౌండ్రకుడు వారి దిక్కైన లేడు. మందిర గవాక్షమును దరిసి అచ్చట నిలబడినాడు. గవాక్షమునుండి కన్పించు దృశ్యమును చూచుచున్నవానివలె ఉండిపోయినాడు. మాతలి కర్థమైనది. "మహారాజా! చెప్పమందురా!" అనినాడు. మహారాజు వానివంక చూడలేదు. మాటాడలేదు. గవాక్షము దగ్గరివాడు గవాక్షమువద్దనే ఉండిపోయెను. మాతలి ఇట్లు చెప్పెను. ఆ చెప్పుటతో వాడు తన్ను తానే మరచిపోయెను. ఆ అనుభవము అట్టిది. అది ఎప్పుడు తలపునకు వచ్చినను తిరిగి దానిని స్వయముగా అప్పుడు అనుభవించుచున్నట్లే యుండెను. ముందు మాతలి తాము బయలుదేరుటయు, దారుకుని రథము రాకకై కాపు కాయుటయు చెప్పెను. "మహారాజా! మీ రను కొన్నట్లాతడు దొంగచాటుగా కాశికను దాటిపో ప్రయత్నించలేదు. మేము కాశిక నాలుగు ద్వారముల వద్దను కాపుంటిమి. విచిత్ర మేమనగా అతని రథము నేను కాపున్న ద్వారమువద్దకే వచ్చెను. అప్పుడు దారుకస్వామిముఖమును చూడగా నాకు సిగ్గైయినది. అతడును స్వామికార్యము నిర్వర్తించుచున్నాడు. నేనును స్వామికార్యమును నిర్వర్తించుచున్నాను. మరి ఈ సిగ్గేలని నాతో నాకు అనిపించినది. ఆలోచించితిని. స్వామి! అప్పుడు అందులోని రహస్యము నాకు అర్థమైనది. అతడు చేయుచున్నది ధర్మము. నేను చేయుచున్న పనిలో నధర్మ మున్నది. నేను అనుకొనినాను, అధర్మము లక్షణ మిట్లుండునుగదా! అని. అప్పుడు దారుకుడు నాతో అనినాడు. "ఓరి! మాతలి! నీవు అధర్మము చేయుచున్నట్లు భావించుచున్నావు. కాని ఒక్కటి మరచిపోయినావు. నీవు సేవకుడవురా! సేవకుని అధర్మము యజమానికంటును. మరియూ యజమానియే అధర్మమును చేయుమని శాసించెనా, ఇక చెప్పనే పనిలేదు" అని. అని మరియు నిట్టులన్నాడు: "మాతలి! నీవు నాకు మిత్రుడవు. నీకు నేను కొన్ని విద్యలు చూపింపనెంచితిని. అందుకు అదను ఇప్పుడు కల్గినది. అందువలన నీ రాజశాసనము నీకు శుభముగనే పరిణమించినది. రమ్మురా! నావెంట" అనినాడు. నేను నా రథమును ఆయన రథమునకు అడ్డముగా నిలిపితిని. దారి ఈయలేదు. మహారాజా! సేవాధర్మమే పెద్దది. అందునను సూతధర్మము మరియు పెద్దది. మేము తరములుగా నిక్కడ సూతులము, మరియు ఆవిద్యయందు మా వంశమువారలందరును అధీ

—51వ పేజీ చూడండి

# దేశవాళీ బయస్కోపులు

కృష్ణానంద్

వచ్చే ముద్రణలో అచ్చు తప్పులు, అవకతవకలు దిద్దుకుంటాం అంటే మరోకసారి పుస్తకం కొంటున్నామా లేదా. అలాగే సినిమాలూను. వాటి కధలు మాత్రం మళ్లీ మళ్లీ "ఇంప్రూవ్" చేసి కాపీలు తీస్తే యేం ? ద్రౌపదీ వస్త్రాపహరణం సరికొత్త కాపీ అవి అలుముకుపోయిన 5 రంగుల చూపించడానికి బదులూ, మళ్లీ కొత్త హీరోయిన్‌తో కొత్త హీరోతో (లావుపాటివా ళ్లీమధ్య ఫ్యాషను గనుక వెనుకటికి యింత లావుగా సినిమాస్కోపు తెరకి చాలినంతవారు లేరు గనుక.) కావాలంటే అచ్చం రంగుల్లోనో గేవా రంగుల్లోనో తీసేస్తే ఓహ్! ఎంత బాగుంటుందని .... " ఈసారి ద్రౌపదికి నైలాన్‌లు, టెరిలీనులు (?) షిఫాన్లు కట్టొచ్చును. పాత రోజుల్లో అనగా సొంత పద్యాలతో సన్నంగా వుండే తారలు సినిమాల్లో "నటించి" నప్పుడు యివన్నీ లేవుగా. కాని యిప్పుడు కొత్త రకం 'విగ్గులూ', కొత్తరకం చీరెలు (5 గజములవి) వస్తున్నాయి. ఇవి బోలెడు సెక్సప్పీలు నిస్తాయి.

అసలు ఓ ప్రొడ్యూసర్‌కి ఓ సినీ'మార్కుడు' (అర్కు డనగా సూర్యుడని భావం) చెప్పాడట. హాలీవుడ్‌లో (?) సినిమాస్కోప్ అను పెద్ద తెర కనిపెట్టడానికి అది చేసినవాడికి తొలి యిన్స్పిరేషను మద్రాసు తారలను చూడగానే స్ఫురించిందని. ఏమనగా : హీరో ఒక ఫ్రేములోను హీరోయిను ఆ తరువాతి ఫ్రేములోను తప్ప యిద్దరూ ఒకే క్లోజప్‌లో ఆగుపించడానికి 35 మి. మి. లు చాలడంలేదని ఓ పరమసత్యం ఆమధ్య బయటపడిపోయింది. అంచాత తెర పెద్దది చేయడం సబబుగా తోచిందిట. కొందరు తారలు వాయుభక్షణం చేసినా, వాళ్లవి రెండు బొమ్మలు మూడ్రోజు లాడిన తక్షణం, నిలువుగా మానేసి అడ్డంగా మాత్రం పెరుగుతున్నారని, 'స్థూలం' గా చెప్పాలంటే సినీరంగంలో మదగజ'యాను'లు (మగ) 'యాన'లు (ఆడ) తయారైపోయి ఈ సమస్య అక్కడికి హాలీవుడ్' లో (?) కి ప్రాకిపోయి .... మొత్తానికి సినిమాస్కోప్ మద్రాసు తారలకి అవసరం అని తేలిపోయిందిట. ఐతే లావుగా వున్నారూ అని హీరో హీరోయిన్‌అని తప్పుపట్టడం ఎంత సాహసం ! బాక్సాఫీస్‌లో ఆదో పెద్ద హిట్ సూత్రం' ఐపోయిన 'హీరో' యుగంలో అంత మాట అనడమా ? అదిన్నూ గాక లావుపాటివాళ్ల దగ్గర వున్న సెక్స్ప్లోయిటేషన్ అవకాశాలు సన్నంగా వున్నవాళ్లల్లో ఎలా వస్తాయి ?

సాధారణంగా సినిమాలు చూసేవాళ్లు సన్నంగా ఉంటారు. అంతే కాదు. పాటకప్రేక్షక జనం సన్నంగా ఉండాలనీ ఒక బెంచికి 6 గురు మారుగా 8 గురు పట్టాలని సినిమావాళ్ల ఏంబిషను. సరే, అలాగే ఉంటారు ప్రేక్షకులు. అంచేత ప్రేక్షకుల "ఏంబిషను" లావుపాటివాళ్లని చూద్దామని ఉంటుందిట. (నిజంగా లావుపాటి హీరో నడగండి తెలుస్తుంది, హీరోయిన్‌ని అడక్కుండానే తెలుస్తుంది) అంచేత ప్రేక్షకుల కోరికపై ఇలా లావెక్కిపోయామని కొంద రనుకుంటున్నారని గాలివార్త.

అసలు దేనికైనా వైరైటీ ఉండాలి. వైరైటీ అనగా మార్పుగాదు. 'ఛేంజ్' అని తెనుగర్థం. కొంతమంది మహానటుల ఎక్స్ప్రెషను (నటన!) లాగ ఈ ఛేంజ్, వెరైటీ అను పదజాలం అర్థం అందరూ గ్రహింపగజాలం.

ఉదా : ఓ కధను తీసుకుని (ఎక్కణ్ణించేనా సరే కాపీరైటు అనగా కాపీచేసుటకు రైటు ?) మొదట పాత తారలతో కొత్త లేటస్టు శ్రోతలు కోరిన హిందీ రికార్డుల పాటలతో ఓసారి తీయడం. పిదప కొత్త హీరోయిన్‌తో పాత హీరోతో (ఎఫెక్టు కోసరం తెనుగుదేశంలో తాజ్ మహల్ సృష్టించి ! గేవా రంగులు వేసి) పెద్ద ప్రొడ్యూసర్‌తో మరోసారి తీయడం. ఆనక యింకో విలన్‌తోను, కొత్త దర్శకుడితోను కొంచెం మార్చి హాలీవుడ్ ఫక్కీలో తియ్యడం (ఎన్నైనయ్యాయి)? ఇలా ఓ అరడజను శతదినోత్సవపు బొమ్మలు లాగేసి ఓహో .... అనిపించొచ్చు. ఇందుకు సూత్రం ఇలా ఉంది. మనిషి అలవాటుకి బానిస (సినితారల నటనతో సహా) మనం సిగరెట్ మానేయగలమా ? కాఫీ మానేస్తామా ? (ఛస్తే మానం) పోనీ కిళ్లీ వదిలేస్తామా (కాశీలోకూడా ఒదలం) అలాగే ప్రేక్షకుడికి సినిమాని అలవాటుచేస్తే ఆకధ నాలుగు నూర్రోజులు అతగాడు చూస్తే ఎంత అలవాటైపోతుందీ అంటే .... "నాకు ఆ కథే కావాలి" అని మద్రాసుకు వినిపించేటంతగట్టిగా అనేస్తాడు కూడాను. ఆ తర్వాత నా 'హీరోయి'ను "అబ్బ నే డ్యాన్సు చేయలేను. అందులోనూ 35 మి. మి. ల ఫ్రేములో బొత్తుగా చాలను" అ డ్యాన్సేదో బ్యాక్‌గ్రౌండ్‌లో యాడవండీ అన్నా, హీరో "బాబోయ్! ఫ్యాంటూ గుండీలు దానిమీద నోబెల్టూ యివన్నీ ఉక్కపోస్తాయి (బొజ్జమీదికి కట్టుకుందికి లుంగీ బెస్టు) అని పాజమా తొడుక్కుని కావాలంటే మీ కామిరాను పరిగెత్తమనండి నే న్నడవను (కారు అలవాటైపోయింది) అన్నా నిర్మాతలు 'హిట్' బొమ్మలు తీస్తారు. ప్రేక్షకులు (బుక్కింగ్ గోడలు విరగ) పడి చూస్తారు (ట!).

ఈలోగా విలన్ బోలెడు ప్రఖ్యాతమైపోయి కమేడియను హీరో అంత ముఖ్యం, హీరోయినంత లావూ ఐపోయి ఒకడు (విలన్) "నేను సినిమా ఆఖర్ని తెంపలు వేసుకోను జైలుకు వెళ్లను ... కావాలంటే ఏ నదిలోనో, కొండమీంచి తోసెయ్యండి వీరమరణం పొందుతాను" అంటాడు.

—49వ పేజీ చూడండి



సాధనావారి "తోబుట్టువులు" లో జమున.



అంజలీ పిక్చర్సు "స్వర్ణమంజరి" లో రామారావు

# నికో
# క్రిమిసంహార సబ్బు
# పార్క్-డేవిస్ ఉత్పత్తి

మీ చర్మాన్ని, మొటిమలు, పొక్కులు, పేయడంనుంచి కాపాడి పరిశుభ్రంగా ఆరోగ్యంగా వుంచుతుంది. దీనితో నిత్యం తల రుద్దుకొంటే, మీ క్రిమిసంహారనురగ, చుండ్రు రాకుండా కాపాడుతుంది. నిరుపమానమైన నికో క్రిమిసంహార సబ్బు మీకు మూడు విధాల లాభం చేకూరుస్తుంది; అది పరిశుభ్రంచేయడం, క్రిములను నాశనంచేయడం, సంరక్షించడం. మీ చర్మానికి కావలసిన సంరక్షణ నిత్యంచేయండి.




—మొట్టమొదటి క్రిమిసంహార సబ్బు, నిత్య ఉపయోగానికి.



# సరాగమాలు

వి ఎ కె రంగారావు

శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారు సినిమాలలో స్వంతంగా పాడిన పాటలు ఇవి: "సీతారామ జననంలో" లక్ష్మణపాత్రధారియైన బి. ఎస్. రాజుతో కలసి పాడిన "గురుర్బ్రహ్మ" శ్లోకంతో మొదలయే సంధ్యావందన గీతం మొదటిది. 'ముగ్గురు మరాఠీలు" చిత్రంలో టి. జి. కమలా దేవి (ఇప్పుడు శ్రీమతి కమలా చంద్రబాబు) తో పాడిన యుగళగీతం రెండవది. పల్లవి నాకూ గుర్తు లేదు కాని అనుపల్లవిలో మాత్రం "పావురా ...తలీల" అని వస్తుంది. తరువాత "పల్నాటి యుద్ధం" చిత్రంలో పాఠకులు గుర్తించిన 'నాగమ్మ తలగొట్టి నలగామబట్టి" మొదలగు పద్యాలే గాక ఎస్వరలక్ష్మితో పాడిన యుగళగీతం 'ఓ హైహా చారుశీలా" అన్నది. వారు పాడిన ఆఖరి పాట "బాలరాజు" చిత్రంలో ఆ వరలక్ష్మితోనే పాడిన "చాలురా వగలు". ఈ ఆఖరి రెండు పాటలు నాగేశ్వరరావుగారు స్వంతంగా పాడినవని చాల ...ంది పాఠకులకు తెలిసినట్లు లేదు. మరొక పాట వీరు పాడిందే, "మందులోయ్" అన్నది. 'మాయలోకం" చిత్రం కోసం రికార్డు చేయ బడినది. కాని స్థలాభావంచేత చిత్రంలో ఉపయో ...ంప బడలేదు.

*  *  *

కొవ్వూరు మురళీమోహన్‌గారికి : మీరు చెప్పిన పాట "కూతురు కాపురం" లోది, చిత్రంలో 'ఏదీ మిగిలిందేదీ" అనీ, రికార్డులో "ఏడీ మొనగాడేడీ" అనీ ఉండటం నిజమే. ఇదీ సెన్సారు ...రి పుణ్యమే. వాద్యానుసరణలో భేదం ఉండ ...నికి కారణం ఇది. సెన్సారయిన తరువాత ... రికార్డింగ్ జరుగుతుంది. అప్పుడు "ఏడీ మొనగా ...డీ" తీసి "ఏదీ మిగిలిందేదీ" అని డబ్‌చేసి వెను వెంటనే వచ్చే మ్యూజిక్ బిట్ కూడ రీ రికార్డు చేయవలసి వచ్చింది. ఆ సమయంలో ఆ చిత్రానికి సంగీతదర్శకులైన రమేష్ నాయుడు వూళ్లో లేరు. సహాయ సంగీత దర్శకుని సహకారంతో ... సంగీత సమస్యాపూరణం జరుగుటలో ఆ తేడాకు ...వేర్పడింది. అదీ సంగతి.

*  *  *

పాఠకులకు ఒక చిన్న ప్రశ్న. "తాశీల్దారు" చిత్రంలో ముద్దులపాపలా మురిపా లొలికించు "ఆహా యేమందునే చినదిన, నీ టెక్కు నీ నిక్కు ...కేసరి" అన్నది, "రత్నమాల" చిత్రంలో వగల ...రువులు చిలికించు వయ్యారాల జావళి "వగలాడి ...నుజేరి" అన్నది పాడిన నేటి ప్రసిద్ధ పార్శ్వ ...యకి యెవరు ?

*  *  *

ఒక చిన్న కథ. అనగా అనగా ఆంధ్రదేశంలో ఒక జానపద గేయం. "అయ్యో కొయ్యోడ" అనేది ఉండేది. ఈపాట పల్లెటూళ్లలో చాలమంది సరదాకు పాడుకునేవారు. కాని పట్టణవాసులకు అంత పరిచితమైనది కాదు. దాదాపు పాతిక ముప్ఫయ్యేళ్ల క్రితం, యెవరు పాడిందో గుర్తు లేదు. రికార్డుగా వచ్చిం దీ పాటే. దొడ్డమ్మ "పుష్కరాల వింతలు" యువర్ ఫేవరిట్ హెూం డాక్టర్ సి. హెచ్. బి. వెంకటాచలం "నా కాలమునాడు" పాటలతోబాటు ఈ పాటనూ, ఆనాడు అశేషంగా ఆదరించిన ప్రజలు రానురాను మరచిపోయారు.

ఇదేపాట ఆమధ్య శివరావు "శ్రీలక్ష్మమ్మకథ" లో పాడారు. దానినీ ప్రజలు అంతగా పట్టించుకో లేదు.

కాలచక్రంలో కొన్ని యేళ్ళు బరువైన ఫ్లాష్ బాక్‌లో ఏాంట్‌జీలలాగ గిర్రున తిరిగిపోయినవి. అప్పుడు సారథీవారి "రోజులుమారాయి" చిత్రంలో ఈ వరసనే కొంచెం మార్చి "ఏరువాకా సాగాలోయ్" పాటగా వేణు ప్రజలమీద వదిలారు. విన్నవారు వెర్రెత్తిపోయారు, నాట్యంచేసిన వహీదాను చూసి కొంత, పాటను విని మిగిలినంత. ఈ పాట పుణ్యమా అంటూ వేణుకు పది కంట్రాక్టులూ వహీదాకు హిందీచిత్రంలో అవకాశం లభించాయి.

"రోజులు మారాయి" చిత్రం కూడా విజయవంతమైనది. సారథీవారు తమిళంలో అదే చిత్రం తిరిగి తీస్తామని ప్రకటించారు. ఈ చిత్రం బయటపడకమునుపే ఇదే వరస "వెరుంపేచ్చెల్ల", "మధురై వీరన్", "మహేశ్వరి" తమిళ చిత్రాలలో వినిపించేశారు. సారథీవారు రేడియోద్వారా ప్రజలను అర్థించటం ప్రారంభించారు. ఏమని ? నకిలీ "చిన్నన్న" పాటలు ఉన్న చిత్రాలను చూడవద్దని, అసలు 'చిన్నన్న' చిత్రం, తమది, త్వరలో వచ్చేదాకా ఆగమనీను. తమ పూర్వ చిత్రాలలో వినిపించిన కాపీ వరసల గురించి మరచి ఉంటారు. అదిసరే. దాని కేముందీ ? తమ తప్పులు మరవటం పెద్దవాళ్లకు అలవాటే.

ఈ పిట్టకథకు ఒక చిన్న తోక. "మధురై వీరన్", "మహేశ్వరి" చిత్రాలు "సాహసవీరుడు" "రాణీ రంగమ్మ" లుగా తెలుగులో అవతరించాయి. అందులోనూ యీ వరసలే వినిపించాయి. మొన్న మొన్న విఖ్యాత హిందీ బెంగాలీ సంగీత దర్శకులు సచీన్‌దేవ్ వర్మన్ "బొంబాయికా బాబు" చిత్రంలో ఆ వరసలో మొదటి రెండు పంక్తులు ఉపయోగించుకొని "దేఖ్ నేమే భోలాహై" అన్న శ్రేష్టైన పాట అందించారు.

విన్నారా ! ఎలా ఉంది మూడు భాషల్లో తొమ్మిది చిత్రాలలో వినిపించిన అమాయిక పల్లె వరస కథ !?

## ఈవారపు సంగీతసమీక్ష

ఈవారం సమీక్షచేస్తున్న అయిదు పాటలూ శ్రీ అనిసెట్టి రచనలే. రాబోయే "తోబుట్టువులు" చిత్రంలో వారి పాటలు వింటారు. ఒకటీ రెండూ పాటలు వ్రాసిన చిత్రాలు త్వరలో విడుదల కాబోయేవి చాలా ఉన్నవి.

పెళ్లితాంబూలం జి. ఇ. 38285.

సాకీ॥ ఏదారీ చనునో తుదకు యేమయ్యేనో
ఎవరు కానగలేరు ఇదే లోకపుతీరు
కాలమంత లీలగా కదలిపోవునోయి
వయసుమీర ఆశలన్ని వదలిపోవునోయి
బ్రతుకు నీకె భారమని చింతపడకుమోయి
అవనిలోనె సౌఖ్యమంత అనుభవించవోయి
—ఏ—

పడవవోలె పడుచుదనం పయనమౌనులే
వింత మోహములా వెల్లువలా మునిగి తేలులే
వెలుగునే చీకటిలో వెదుకజూచులే
కొత్త కోరికలా తీరమునే చేరజూచులే —ఏ—
కష్టములు సౌఖ్యములూ బుతువులౌనులే
కడకు హృదయమంత మమతలే చెదరి పోవులే
తీయనైన రేయివోలె హాయి గొలుపులే
బ్రతుకు కమ్మనైన కలవోలె కరగిపోవులే
—ఏ—

ఈమధ్యన వచ్చిన సినిమాపాటలలో స్థైదానంత విలువైనది మరి లేదు. చిక్కని ఊహలను చక్కని మాటలలో పొదిగిన అనిసెట్టి ప్రజ్ఞ అసామాన్యం "గ్రీష్మభానుని ప్రథమ మయూఖమున వేచిన తైక్ష్ణ్యము. శిశిరశశివదన చంద్రికాంతర్యమున నిలచిన గాంభీర్యము, ఏకాంత హేమంత సాయంత్రమున దాగిన నిరాశాపూరిత నిర్వేదము" ప్రతి చరణంలో పలకరిస్తాయి. ప్రశ్నిస్తాయి. ప్రక్షిప్త భావసౌందర్యముతో శ్రోతలను త్రుటికాలం నిర్ఘాంతపరుస్తాయి. ఇక తక్కినవాటి విషయం. పాట నృత్యగీతిక. పాడినది సుశీల. వరసను చేసింది విశ్వనాథన్ రామ్మూర్తి. వెన్నెలతరి. ప్రేమలసిరి. ప్రియుని దరి. కావలసిన దింకేమిటి ? పాటను విని నిర్మల నిశ్శబ్దంతో ఆ పాట మాధుర్యానికి కారకులు యే ఒక్కరా అని మధుర వృథా ప్రయత్నం చేయటానికి కొన్ని క్షణాలు. ఆ శ్రవణం వలన కలిగిన ఆనందానికి విలువనెంచ విఫలయత్నం చేయ

62-వ పేజీ చూడండి




## అల్లుళ్ళూ—అలుకలూ

విజయ రచించిన "అల్లుళ్ళూ—అలుకలు" అను వ్యాసము చక్కగా, వాస్తవముగా ఉంది. కాని అందరు అల్లుళ్ళూ అలా ఉండరు. నూటి 75 మంది మంచివారుంటారు. మచ్చుకు, మాకు తెలిసిన ఒకాయన ఒక కలవారి అమ్మాయిని చేసుకొన్నాడు. అతని మామగారు ఏమీ పెట్టకపోయినా, సంతోషముగా ఉన్నాడు. ముఖ్యముగా అల్లుళ్లకంటె అల్లుళ్ల తల్లులే చాలా గోల పెట్తారు. మాకు తెలిసిన ఒకావిడ కోడలు ఏమీ తేలేదని (తెచ్చినా) అంటుంది. అల్లునికి ఆమెతండ్రి అన్నివిధాల పెట్టినా పెట్టకపోయినా సంతోషపడ్తాడు. కాని, అతని తల్లి ..... చెప్పద్దూ! అత్తా ఒకింటి కోడలన్నట్లుగా అల్లుడు ఒకటని మామ అను సూక్తి నిజము.

కొత్తపల్లి రాజరత్నం (ఆర్మూర్)

* * *

వ్యాసం మామలకుమాత్రం తప్పక నచ్చుతుంది.

జి. విజయ (మంచిర్యాల)

* * *

మాకు తెలిసినవారిలో ఒకతను అత్తగారు చెప్పినది ఇవ్వలేదని గర్భిణిగాఉన్న తన భార్యను చూచుటకుగూడ పోకుండా ఉన్నాడు. ఇటువంటివారు ఈ వ్యాసమును చదివియైనను మనస్సును మార్చుకొందురని ఆశించుచున్నాను.

శ్రీమతి జయమోహన్ (తిరువళ్ళూరు)

* * *

ఈరోజుల్లో కూడా ఎంతోమంది మామగారి ఆర్థిక పరిస్థితులను గుర్తించకుండా, అర్థంలేని అలుకలతో, పట్టుదలలతో వచ్చిని సంసారాల్లో చిచ్చు రేపుతున్నారు. ముఖ్యంగా విద్యాధికులయిన అల్లుళ్లు చదువుకున్నామనేగర్వంతో సంస్కారహీను లయి ప్రవర్తిస్తున్నారు.

పి. ఎస్. రావు (అనన్‌పోల్)

"అల్లుళ్ళూ—అలుకలూ" చదివి చాలా బాధపడ్డాను. అల్లుళ్లందరూ ఒకేలాగుండరు. ఎంత మంది సహృదయులు లేరు."

ముఖ్యంగా, "అన్నిటికన్నా విశ్వాసమైన దేమిటీ అంటే కుక్క అని, అన్నిటికన్నా విశ్వాసహీనమైన దేమిటీ అంటే అల్లుడని" అన్న ఉదాహరణ మరీ బాధపెట్టింది. రచయిత్రి తొందరపడ్డారేమో పిస్తుంది.

మాచిరాజు శోభనాద్రిరాజు (ఏనుకూరు)

* * *

అన్నిటికన్నా విశ్వసనీయమైనదేమిటీ అంటే కుక్క అనీ, అన్నిటికన్నా విశ్వాసహీనమేమిటీ అంటే అల్లుడనీ వ్రాశారు. ఇప్పటి పరిస్థితులు చూస్తూంటే ఆ వాక్యాలు నిజమనిపిస్తున్నాయి.

అ. సుభద్ర (పల్లింకుర్రు)

* * *

నిజంగా ఈ అల్లుళ్ళ అలుకలు చూస్తుంటే ఆశ్చర్యం, అసహ్యం వేస్తుంటాయి. నాగరికులనబడే ఈ విద్యావంతుల్లోకూడా ఈ రోగం ఉండటం చాలా శోచనీయం. అల్లుడు కాగానే అహంకారం, గర్వం, భూషణాలుగా తయారవుతాయి. ఎందుకో వీరి అహంకారం! అనిపిస్తుంది.

కె. రమాదేవి (కూచిపూడి)

* * *

ఇటువంటి వ్యాసాలు చదివి మారుతారేమో అన్నారు. కాని, అది కల్ల. ఇటువంటి వ్యాసాలు చదివి మారితే ఇక ఏమి కావాలి!

జె. సుజాత (మోరి)

* * *

ప్రస్తుతం మనదేశంలోగల అల్లుళ్ల అలకల గురించి ఉన్నదున్నట్లుగా వర్ణించారు. ఈ అల్లుళ్ల అలకలవలన ఎందరు స్త్రీహృదయాలు దెబ్బతింటున్నాయో బాగుగా వ్యక్తపరిచారు. ఈవ్యాసం ఒక విధంగా అల్లుళ్ల అలకలను విమర్శించింది.

బందలుప్పి అమ్మడు (విజయనగరం)

* * *

"అల్లుళ్ళూ అలుకలూ" వ్యాసం వర్తమానంలో సత్యానికి దూరంగాఉంది. పిల్లలకు పెళ్ళి చెయ్యాలనే తాపత్రయంలో స్తోమతనూ, ఆర్థికబలాన్ని కూడ గుర్తించుకోకుండా నిలబెట్టుకోలేని వాగ్దానాలను మామగార్లు ఇవ్వటమే, బహుశా వ్యాసంలో పేర్కొన్న వైపరీత్యాలకు కారణం అయ్యుండచ్చు. తమ పుత్రరత్నాలకుమాత్రం భారీ కట్నాలు పుచ్చుకుని, అన్ని ఆనవాయితీలు క్రమం తప్పకుండా జరిపించుకున్న పెద్దమనుష్యులు, నాగరికత, సంస్కృతిగల అల్లుళ్ళు దొరకంగానే, కనీసపు ఆనవాయితీలు సహితం, "మాలో ఆచారం లే"దంటూనూ, లేక "అచ్చిరాలే"దంటూనూ ఎగగొట్టిన మహాత్ములెంతమంది లేరు? వాళ్ల విషయాల్లో మౌనం వహిస్తూ, ఒక్క అల్లుళ్లనే దుయ్యపట్టడం చాల శోచనీయం. ప్రతి అల్లుడూ మామగారు కాకపోవచ్చుకాని, ప్రతి మామగారు ఒకప్పుడు అల్లుడే.

మామిడన్న అంబుజ (కాకినాడ)

* * *

వరకట్న నిషేధ చట్టం అమలులో ఉన్నప్పటికినీ, కట్నములబాధ పెచ్చుపెరిగిపోతూంది ప్రపంచంలో. భాగ్యవంతుల కేబాధ లేదుగాని, మధ్య తరగతి కుటుంబాలు మాత్రము ఉక్కిరిబిక్కిరై పోతున్నాయి. వాస్తవికతను స్పష్టీకరించుటచే శ్రీమతి విజయగారికి నా ధన్యవాదాలు. దీనిని చదువుటవలన వారిలో మనఃపరివర్తన కలుగునని నా ఆశయము. కాని, "అన్నిటికన్నా, విశ్వాసహీనమేమిటి అంటే అల్లుడని" అంటూ ఉంటారు అని వ్రాశారు. వాళ్ళ నంత న్యూనతపరచటం సమంజసము కాదేమోనని తోచుచున్నది.

అల్లుళ్లలో ధర్మస్వరూపులు, నీతిపరులు—అత్తవారి పెట్టిపోతల కానపడక—అలకలులేక, తన సంసారాన్ని చక్కగ దిద్దుకొనువారు లేకపోలేదు.

కె. కామేశ్వరమ్మ (పాలవర్రు)

* * *

ఆవిధంగా అలిగే అల్లుళ్ళు ఈ రోజుల్లో కూడా ఉన్నారా అని సందేహం.

దావులూరు జయలక్ష్మి (హైదరాబాదు)

* * *

నేను ఒక విషయంమాత్రం నిర్మొహమాటంగ నిష్పక్షపాతంగా అడుగుతాను. అది ఏంటంటే పెళ్ళయిన క్రొత్తల్లో కట్నాలు, కానుకల విషయములో మామగార్లమీద అలిగే అల్లుళ్ళు కుక్కకన్న హీనమైతే, ప్రతిరోజూ, ప్రతిక్షణము భర్త ఆర్థిక స్తోమతు, తాహతు, కుటుంబ పరిస్థితుల తెలిసికోకుండా ఫ్యాషన్ చీరలు కావాలని, రాళ్ళనగల కావాలని రిలీజయిన సినిమాలన్నీ చూడాలని భర్తలన వేధించుకు తినేవాళ్ళను, చీకాకుపరచి అలుకగృహంలో సత్యభామల్లాగ తయారయ్యే నారీమణులు వేటికన్న హీనమంటారు?

కె. నిర్మల (వెంకటాచలం సత్రం)

* * *

## ఒంటరి ప్రయాణాలు

ఒంటరి ప్రయాణాలు వ్యాసం చదివాను. చదువుతుంటేనే, మధ్యలో నాకు భయంవేసింది. రాత్రి పూట ఒంటరి ప్రయాణం. తెలియనిచోటు. అబ్బ! తలచుకుంటేనే వళ్ళు గగుర్పొడుస్తోంది.

గుత్తా రత్నమాణిక్యం (అంపాపురం)

*   *   *

"శశికళ"గారు "ఒంటరి ప్రయాణా"లను గూర్చి వ్రాయబోయి తన అనుభవం మాత్రమే చెప్పి, వ్యాసాన్ని అసంపూర్తిగా ముగించారనుకుంటాను. మనం అంత భయపడవలసిందేగాని, ఎదుటివారిలో ఏమో చెయ్యగలిగినంత ధైర్యంమాత్రం ఉండదు! రైల్లో అల్లాంటి ప్రమాదాలకు ఆస్కారం ఉండనే ఉండదు సాధారణంగా.

యస్. ఆర్. దేవి (పామిడి)

*   *   *

రైల్వేస్టేషనుకి వెళ్ళి స్టేషన్ మాస్టర్ని ట్రయిను రైటు టయిముకి వస్తున్నదా అని అడిగితే, బైట బోర్డు చూడండి అంటారు. బోర్డు చూస్తే ½ గం. లేటు అంటారు అనుకోండి. ½ గం. అయ్యేక ఇంకా ట్రయిను రాదు. ఏమండీ ½ గం. అని రాశారు, ఆ టయిము అయినది. ఇంకా రాలేదేమి అని అడిగితే మాకు మాత్రం ఏం తెలుస్తుందండి అని జవాబిస్తారు. పోనీ, ఆడవాళ్ళు వచ్చి అడుగుతున్నారు; సరిఅయిన భోగట్టా ఇద్దామూ అని వాళ్ళకుండదు.

శ్రీమతి మూర్తి (గోవన్నపాలెం)

## మీ వయస్సెంత?

ఎవ్వరయినా మీ వయస్సు ఎంత? అని అడిగితే నిజం చెప్పేస్తాను. కాని, ఎవ్వరూ నమ్మరు. ఏం చేయమంటారు. నా వయస్సు 17 ఏళ్ళు. వయసుకు మించిన ఎత్తు వుంటాను. అందువల్ల ఎవ్వరూ నమ్మరు!

ప్రమీల (ఉరవకొండ) ★

## వంటలు

### మోహన్ లడ్డు

**కావలసిన వస్తువులు:**

| | |
|---|---|
| మైదాపిండి | — ½ అర్ధాకు |
| పంచదార | — ½ అర్ధాకు |
| నెయ్యి | — ½ కప్పు (సుమారు) |
| ఏలక్కాయలు | — 5 |
| జీడిపప్పు | — 6 లేక 7 |

నీరు చేర్చి మైదాపిండి కలిపిన తరువాత పూరీలుగా చెయ్యాలి. పూరీలను చిన్న చిన్న ముక్కలుగా కోసి, నేతిలో వేయించాక పిండిగా దంచుకోవాలి. పొడికొట్టిన చక్కెర, యాలక్కాలు, వేయించిన జీడిపప్పు ఆ పిండిలో కలపాలి. కొంచం పాలు చల్లి ఉండలు చెయ్యాలి.

★

ఎప్పుడూ ఇంతే

శంకర్



## వనితాలోకం

# స్నేహం

### ఎస్. రంగారాణి

"ఉత్సవే వ్యసనే చైవ దుర్భిక్షే శత్రు విగ్రహే
రాజద్వారే శ్మశానే చ యస్తిష్ఠతి స బాంధవః"

ఉత్సవ సమయంలో, విపత్కాలంలో, క్షామము వచ్చినప్పుడు, శత్రువులు దాడిచేసినప్పుడు, న్యాయస్థానములో, శ్మశానంలో ఎవడైతే ఆదుకుంటాడో, అతడే బాంధవుడు. అంటే నిజమైన స్నేహితుడు.

స్నేహం పవిత్రమైనది. నిర్మలమైనది. పువ్వు వంటిది. పుష్పం వికసిస్తుంది. పరిమళిస్తుంది. సౌందర్యం, సౌకుమార్యంగలది. సున్నితమైనది. ఘుమఘుమలాడుతూ సువాసనలను వెదజల్లుతుంది. మానవులను, పశుపక్ష్యాదులను ఆకర్షిస్తుంది. మోహింపజేస్తుంది. పుణ్య, పవిత్రభావాలను కలిగిస్తుంది. హాయినీ, ఆనందాన్నిస్తుంది. కాని వికసించిన పుష్పం వాడిపోతుంది. వాడిన పువ్వు తిరిగి వికసించలేదు.

స్నేహరూపక పుష్పముకూడా సున్నితమైనదీ, సౌందర్యం కలది. ఈ స్నేహగుణం ఆత్మీయత, ఆనందం, అనురాగం కలిగిస్తుంది. స్నేహితులను పరస్పరం ఆకర్షింప జేస్తుంది. కానీ ఈ పుష్పం వాడిపోదు. స్నేహానికి మృత్యువులేదు.ఇది అమరమైనది. నిత్యనూతనంగా, ఆనందసౌందర్యాలతో వికసిస్తుంది. మానవులను అతిదగ్గరగా చేర్చేది ఈ స్నేహబలమే. బాంధవ్యం, రక్తసంబంధంకంటే ఈ స్నేహమే ఉన్నతమైనది. ఇందులో ఈర్ష్యాసూయలకూ, రాగద్వేషాలకూ తావులేదు. స్నేహానికి కులమతభేదాలు, ధనికదరిద్రుల తారతమ్యాలు అవసరంలేదు. భావాలు ఏకమైతే పరస్పరం స్నేహం చేయడం సులభం. ఒకరి మనోభావాలు, అభిరుచులు మరొకరికి నచ్చితే పరస్ప సహకారం వలన, ప్రోత్సాహంవలన ఆభావాలు, అభిరుచులు ఉన్నతమవడమేగాక ఆ స్నేహంకూడా వృద్ధిచెందుతుంది స్నేహానుబంధం జన్మజన్మాలకూ విడిపోనిబంధం. ఈ అనుబంధాన్ని తృటిలో త్రుంచివేయడం అసాధ్యం. ఈ క్షణికప్రపంచంలో మానవజీవితాలు అతిక్షణికమైనవి. మానవుల మరణానంతరం శరీరాలు మట్టిలో కలిసిపోతవి. కానీ మానవులలోవున్న ఆత్మ పరమాత్మునితో సమానం. ఈ ఆత్మకి మరణంలేదు. స్నేహానుబంధంవలన మానవుల హృదయాలు కలియడమేగాక వారి ఆత్మలుకూడా పరస్పరం ఏకమౌతవి. ఆత్మతోబాటు స్నేహంకూడా చిరకాలం అమరమైనదిగా వుండగలదు. స్నేహితులు మనస్పర్థలువచ్చి విడిపోయినయెడల అది వారి నిజమైన స్నేహం కాబోదు.

నామట్టుకు నేను బాంధవ్యంకంటే స్నేహానికే ఎక్కువ ప్రాముఖ్యతనిస్తాను. ఈ రోజు నా స్నేహితురాలివద్దనుండి ఉత్తరము వచ్చినది. అది చదువుతూంటే ఏదో తెలియని అవ్యక్త ఆనందానుభూతిలో మునిగిపోయాను. మేము కలిసి ఒకే ఊళ్లో ఉన్నప్పుడు జరిగిన సంగతులు, మా స్నేహం అన్నీ జ్ఞాపకానికివచ్చి నా కళ్లు చెమ్మగిల్లాయి. స్నేహమంటే ఏమిటని ఆమె వ్రాసింది. స్నేహానుబంధం ఎటువంటిదోగానీ ఆబంధాన్ని తృటిలో త్రుంచివేయడం అసాధ్యమనీ, ఇంకా ఏవో చాలా విషయాలు వాళ్ళమాతృభాష ఒరియాలో వ్రాసింది. ఆ జాబు చదివినవెంటనే నాకు స్నేహంగురించి ఒక వ్యాసం వ్రాయాలనిపించింది. కనుక స్నేహం గురించి నాకున్న అభిప్రాయాలు పైన వ్రాశాను. అనుభవాలను గురించి వ్రాస్తున్నాను.

మా నాన్నగారికి ఒరిస్సాలో ఉద్యోగముకావడం వలన మేమంతా చాలా సంవత్సరాలై ఒరిస్సాలోనే ఉంటున్నాము. కనుక ఇక్కడ మాకు చాలామంది ఒరియా స్నేహితులు, బెంగాలీ స్నేహితులు ఉన్నారు. మా నాన్నగారి ఉద్యోగరీత్యా మేము కొత్తగా ట్రాన్స్‌ఫర్ మీద వెళ్ళినవూరు మాస్వంత ఊరికి చాలా దూరం. అక్కడ మన తెలుగుభాష తెలిసినవాళ్లుగానీ, మా బంధువులుగానీ ఎవరూ లేరు. అక్కడికి వెళ్ళిన కొత్తలోనే మా తాతగారు పోయారు. ముక్కూ మొగం తెలియని ఆ ఊళ్లో మమ్మల్ని ఆదరించి, అటువంటి కష్టసమయంలో ధైర్యంచెప్పి, సానుభూతిచూపి మా ప్రక్కనుండే ఒక డాక్టరుగారి కుటుంబం, మా ఇరుగు పొరుగువారు మాకు చాలా సహాయంచేసారు. వారు మాకు చేసిన ఉపకారం మేము ఎన్నటికీ మరువలేము. ఆ ఊళ్లోనే మాకు ఒరియావాళ్ళు, గుజరాతీవాళ్ళు, బెంగాలీలు చాలామంది స్నేహితులయ్యారు. వాళ్ళంతా పిలిస్తే పలికి మమ్మల్ని ఆదరించి ఆదుకునేవారు. ఆ తర్వాతకూడా మేము చాలా ఊళ్ళు ఈ ఒరిస్సాలోనే తిరిగాము.

కానీ అందరు స్నేహితులూ ఒకేలా ఉండరు. పైకి మంచితనంతో తియతియ్యనిమాటలు చెప్పి, వెనుక హాని తలపెట్టేవాళ్ళు చాలామంది ఉంటారు. అటువంటి వాళ్ళని సంస్కృతంలో ఒక శ్లోకంలో చెప్పినట్లు త్యజించడం చాలామంచిది.

"పరోక్షే కార్యహంతారం ప్రత్యక్షే ప్రియవాదినం
వర్జయేత్తాదృశం బంధుం విషకుంభం పయోముఖం."

అంటే పరోక్షంగా కార్యహానిచేసి, మనముందు మంచిమాటలు పల్కినవాళ్ళని పయోముఖ విషకుంభంలా త్యజించాలి. ఇటువంటివాళ్ళు నిజమైన స్నేహితులు కాజాలరు.

సంఘంఅన్న తర్వాత మనమంతా సంఘజీవులమని పరస్పరం సహాయం చేసుకుంటూ కలిసికట్టుగా వుండకుంటే మనం సమాజంలో బ్రతకలేం. కాని మానవులన్నతర్వాత వారిలో ఈర్ష్యలు జుగుప్సలు వుండకపోవు. కానీ అటువంటి వాళ్ళతోగాక మన అభిప్రాయాలకు దగ్గరగా వున్నవాళ్ళతో స్నేహం అలవరుచుకోవడం చాలామంచిది. అటువంటప్పుడు వాళ్ళలో మనస్పర్థలు కలగడానికిగానీ ఒకరిమీద ఒకరికి ఈర్ష్యలు కలగడానికిగానీ అవకాశం ఉండదు.

అయితే ఈ ఈర్ష్యాజుగుప్సలు, ఓర్వలేనితనం స్నేహితుల్లోకంటే బంధువుల్లోనే కాస్త ఎక్కువగా ఉంటుందని నా అభిప్రాయం. బంధువులనగానే ఏదో మనవాళ్ళనీ, మనతో సంబంధంవున్న వాళ్ళనీ, వాళ్ళు మనల్ని కొన్ని సందర్భాలలో ఆదుకోగలరనీ ఆశిస్తాం. కానీ కొంతమంది దానికి బదులుగా అసూయాజనితమైన, అసహ్యకరమైన ప్రవర్తన చూపిస్తారు. కొన్ని పరిస్థితులలో, కొన్ని సమయాల్లో నీచంగా ప్రవర్తిస్తారు. ఈ పొరపాటు స్నేహితుల్లో సాధారణంగా కనిపించదు. ఈ సందర్భంలో ఒక చిన్న ఉదాహరణ ఇస్తున్నాను.

మా నాన్నగారి బదిలీరీత్యా మేము ఒకవూరు ఒకసారి వెళ్ళవలసి వచ్చింది. ఆవూళ్ళో మానాన్నగారికి బాగా పరిచయమున్నవాళ్ళింటికి ముందుగా నాన్నగారు, మేము ఆవూరు వస్తున్నట్లు వుత్తరం వ్రాశారు. వాళ్ళు, అంటే మా స్నేహితులు బస్‌స్టాండుకు వచ్చి, మమ్మల్ని ఎంతో ఆదరంగా వాళ్ళింటికి తీసుకుపోయి రెండురోజులు వాళ్ళింట్లోనే ఉంచుకుని చాలా బాగా మర్యాద చేశారు. వాళ్ళు చూపిన ఆదరణ, ఆప్యాయత చూస్తే మా కళ్ళు ఆనందంలో చెమ్మగిల్లాయి. ఆతర్వాత మేము అక్కడవున్న మా క్వార్టర్స్‌కి వెళ్ళి పోయాము.

అయితే ఇటువంటి ప్రవర్తన కొందరి బంధువుల్లో కనుపించదు. కానీ అందరు బంధువులుగానీ, అందరుస్నేహితులుగానీ ఇలాగే వుంటారని కాదు. అయితే ఆ వున్నకొంతమంది వాళ్ళలో వున్న పొరపాట్లు సరిదిద్దుకోగలిగితే మంచిది. బాంధవ్యంకంటే స్నేహమే గొప్పదని చెప్పే నా అభిప్రాయం పొరపాటు కాదేమో. ఈ నా అభిప్రాయంతో మీలో ఎంతమంది ఏకీభవిస్తారో! ★

# విడీ విడని చిక్కులు



## 28

వాటాలకొంప అన్నతర్వాత అనేక సాధక బాధకా లుంటాయి. కాని అలవాటుపడ్డ ప్రాణి అయితే వాటాల్లో అయితేనే కొంత మెరుగు అంటారు.

మనుషులకి తగినంత వ్యాపకం అవసరం. మన సమాజంలో పురుషుడికే జీవనపరిధి, వ్యాపకమూ చాలా తక్కువ. ఉద్యోగం, ఇల్లూ ఈ రెండూ రెండు గోడలు. వీటిమధ్యనే అతగాడి ఉనికి. తనొసినిమా చూస్తే ఆనందిస్తాడు. తన పెళ్లాం తోనూ, పిల్లలతోనూ సినిమాకి వెళ్లగలిగాడో ఇంకా పరమానందం.

వరసమ్మగారి లోగిలిలో ఉన్న కుటుంబాలన్నీ లెక్కాడితేనే గాని, డొక్కాడని తరహా కుటుంబాలే.. అన్నింటికీ బహు విచిత్రమైన చరిత్రలు, సంప్రదాయాలు ఉన్నాయి.

ఉదయం భర్తలు ఆఫీసులకి వెళ్లేవేళ... పిల్లలు బడికివెళ్లేవేళ. సుభద్రమ్మగారికి, లలితాంబగారికి విరంజివంగారి విధవప్ప చెల్లెలు— ఆవిడ నంతా అలాగేఅంటారు—పోతే "పిన్ని", "అత్తయ్యా" లాంటి వరుసలు కలుపుతారు—వీళ్లంతా అష్టావధానంలో ఉంటారు.

భర్తలటు వెళ్లిపోయింతర్వాత మిట్టమధ్యాహ్నం అయిం దగ్గర్నించీ నాలుగు గంటలదాకా వీళ్లకి కాలక్షేపం కావాలి.

పురాణశ్రవణం ఈమధ్య జరగకపోవడంతో

42-వ పేజీ చూడండి

### జరిగిన కథ

ఐదు వాటాల లోగిలిఇల్లుగలావిడ వరసమ్మగారు మనుమడు సూర్యానికి తల్లీ తండ్రీతానే అయి పెంచింది. శంకరంగారు హెడ్క్లార్కుగావున్న కంపెనీలో చేరిన సూర్యానికి ఆయనం టేగురి. ఆ ఐదు వాటాల లోగిలిలో రకరకాల కుటుంబాలున్నాయి. అందులో సాంబశివంలలితాంబా వాళ్ల రాజ్యలక్ష్మికి వరసమ్మగారంటే చనువూ, భక్తీ. ఆపిల్లకి సూర్యం శాపంటే సిగ్గూ, నిర్మలంటే స్నేహం. సాంబశివంగారికి గతం గాయం. సూర్యానికి నిర్మలంటే సానుభూతి. అదివరకు తెలియని మేనమామ జయరావు రాక, పరిచయం సూర్యానికి గతమంటే భయాందోళనలను కలిగిసుంది. నిర్మలకి ట్యుటోరియల్ కాలేజీలో అవమానం జరుగుతుంది. నిర్మలకి పాఠాలు చెబుతూంటాడు సూర్యం. జానికమ్మకి సూర్యమంటే ఆనకి కలిగింది. సూర్యం ఆఫీసులో 'రీటా' అనే పిల్ల టైపిస్టుగా చేరింది. జయరావు తన కూతురు మీనాక్షిని వరసమ్మగారి ఇంట్లో దిగవిడిచి వెడతాడు. సూర్యానికి ఆఅమ్మాయితో చనువు ఏర్పడుతుంది.

# హాయివాతా ప్రణయగాథ

మూలం: లాంగ్ ఫెలో

అనుసరణ: పి. గణపతిశాస్త్రి



## జరిగిన కథ

జాబిల్లి చిన్నారి భార్య నోకోమిస్ ముద్దులకూతురు వెనోనా. పడమటిగాలి అనే టక్కరివాడు వెనోనాను మోసగించి మటుమాయమవుతాడు. వెనోనా హాయవాతాను కని దిగులుతో మరణిస్తుంది. నోకోమిస్ మనుమణ్ణి చేరదీస్తుంది. ఒకరోజున హాయవాతా అడవిలో తప్పిపోతాడు. అతణ్ణి ఒక బ్రహ్మరాక్షసి పెంచుకుంటూ ఉంటుంది. నోకోమిస్ ఒక భూతవైద్యునివల్ల ఈ సంగతి తెలుసుకుని బ్రహ్మరాక్షసిని మోసగించి తిరిగి తన మనుమణ్ణి తెచ్చుకుంటుంది. హాయవాతా క్రమక్రమంగా పెరిగి పెద్దవాడవుతాడు. నోకోమిస్ భవంతికి దగ్గరగా ఇయాగూ అనే విచిత్రవ్యక్తి ఉంటాడు. అతని ప్రోత్సాహంతో హాయవాతా నట్టడవిలో నానా భీభత్సం చేస్తున్న జింకను సంహరిస్తాడు. ఒకరోజున భూతవైద్యుడొకడు హాయవాతాకు జింక చర్మంతో తయారుచేసిన విచిత్ర కవచాలు, పాదరక్షలు ఇస్తాడు. వాటిని ధరించి అతడు ఎందరెందరో వీరులను ఓడిస్తాడు.

అంత పరాక్రమశాలి అయినా తన తల్లిదండ్రులెవరో తెలియక హాయవాతా మనోవ్యాధికిలోనవుతాడు. నోకోమిస్ జరిగిన కథ అంతా పూసగుచ్చినట్లు చెబుతుంది. హాయవాతాకు పట్టరాని కోపం వస్తుంది. పడమటిగాలిమీద పగతీర్చుకోవాలని బయలుదేరివెడతాడు. పడమటిగాలి అతణ్ణి పోల్చుకుని, కపటప్రేమ ఒలకబోస్తూ కోటలోకి తీసుకువెడతాడు. హాయవాతా ఆదుష్టుడికి దేనివల్ల ప్రాణభయం కలుగుతుందో తెలుసుకుంటాడు. ఇంతలో పడమటిగాలి వికటంగా నవ్వుతూ ఒక పొడుగాటి చెట్టును పెళ్లగించడానికి ప్రయత్నిస్తూండడం చూచి హాయవాతా భయభ్రాంతుడవుతాడు.

---

ఆనీనాక్రోశం విని పడమటిగాలి నిలువునా నిర్ఘాంతపడ్డాడు. మరుక్షణంలోనే ఆ పొడుగాటి చెట్టుపట్టు వదిలిపెట్టి పకపకా నవ్వడం మొదలుపెట్టాడు. హాయవాతాకిప్పుడు కొంచెం ధైర్యంవచ్చింది. నెమ్మదిగా కొంచెం దగ్గిరికివెళ్ళి అడిగాడు:

'ఎందుకలాగ నవ్వుతున్నావు! నీకేమన్నా మతిగాని పోయిందా?'

'నామాట కేంగాని ముందు నీకే మతిపోయింది! చెట్టుకాస్త అటూఇటూ కదపగానే ఎందుకలాగ భయపడిపోతావు? అమాంతంగా దీనితో మోది నిన్ను చంపేస్తాననుకున్నావా! నేనంతటి ద్రోహిని కానులే! నిన్ను చంపనులే! యుద్ధంలోనే కాని నేనెప్పుడు శత్రువుల్ని అన్యాయంగా చంపను! తెలిసిందా! భయపడకు!'

ఆ సమాధానం విన్నాక హాయవాతాకి బాగా ధైర్యంకలిగింది. 'ఎంత కంగారుపెట్టేశావు నన్ను!' అన్నాడు. ఆ తరవాత వాళ్లిద్దరు ఒక పసిరిపచ్చిక మైదానంలో మర్రిచెట్టుకింద కూర్చుని పిచ్చాపాటీ మొదలుపెట్టారు. హాయవాతా చిన్ననాటి స్నేహితుల్ని గురించి,

—39 వ పేజీ చూడండి



# హాపేషా తమాషా



## చిత్రగానం

పలికెడిది చిత్రకథయట!
పలికించెడివాడు 'రావుబహదరు'డట! నే
పలికిన ఋణహారమగునట!
పలికెద వేరొండుగాథ పలుకగ నేలా?
ప్రౌఢి పఠింప తమిళము పాటయంద్రు
పలుకు నుడికారమున తెల్గుపాటయంద్రు
ఎవ్వరేమన్న నంద్రు నాకేమి కొరత?
నేను పాడినపాట హిందీ! నకలుర!
శుద్ధమైన 'కాక' సుంతయైనను చాలు
తోలెడైన నేమి తోరు 'కాక' (?)
భక్తితోడి 'కాక' పలుమారు లేలరా?
విశ్వదాభిరామ! వినుర వేమ!

అత్తిలి వెంకటరమణ,
(రాజమండ్రి)

* * *

## లోకజ్ఞుడు

ఉపాయాల ఉమాపతిగారు ఒకసారి నీలగిరి వెళ్లారు. అది ఎండాకాలం కావడంచేత ఎక్కడెక్కడి జనమూ వచ్చి అక్కడ మకాం చేశారు. హోటళ్లన్నీ కిక్కిరిసి పోయాయి. ఉమాపతిగారు ఒక హోటల్‌కు వెళ్ళి తనకో గది ఇమ్మన్నారు.

"మీరు ముందుగా రిజర్వు చేసికున్నారా?" హోటల్ గుమాస్తా ఆయన్ను ప్రశ్నించాడు.

"రిజర్వు చేసుకోవాలా! పదేళ్లుగా నేనిక్కడికి వస్తున్నాను. ఎన్నడూ లేనిది ఇవ్వాళ్ళ రిజర్వు చేసుకోమంటావేమిటి?

"క్షమించండి! ఈ ఏడు చాలా మంది వచ్చారు. మా హోటల్లో గదులు లేవు. మీరు ముందుగా రిజర్వు చేసుకుని ఉంటే ఇచ్చే వాళ్ళం."

"భలేగా ఉందే నీ వ్యవహారం! డా॥ రాజేంద్రప్రసాద్ ఇక్కడికి వస్తున్నారని చెప్పాననుకో అప్పుడాయన కోగది ఇచ్చేవాడివేగా."

"ఆయన సంగతి వేరు."

"ఏమిటయ్యా వేరూ మొదలూను. డా॥ రాజేంద్రప్రసాద్ ఈ రాత్రి ఎల్లాగూ ఇక్కడికి రావటంలేదు కనక ఆయన కివ్వదలచిన గది నాకిచ్చెయ్. అంతే!" ఉమాపతిగారు గుమాస్తాను టోకరా కొట్టించారు.

కె. రాజారావు (ఒంగోలు)

* * *

## తెనుగుతల్లి

మహితసురలోక శ్రీసుధా మధురిమమ్ము,
పారిజాతాది దివిసుమ సౌరభమ్ము,
కల్పతరు కామధేనుల గౌరవమ్ము,
కలవు, కలవమ్మ, నీ 'పచ్చిపులుసు'నందు.
పంచభక్ష్యపాయసయుతి, ఫలపంక్తి,
షడ్రసోపేత దివ్య భోజనముగూడ;
అన్ని యమరియు, ఉప్పు లేనట్టి కూర
గాదె! ఓయమ్మ! నీ 'ఊరగాయ' లేక.
ధ్యానమాత్ర, దర్శనమాత్ర, ఘ్రాణమాత్ర,
శ్రవణమాత్ర, లాలాజలప్రసరకరమ్ము,
అద్వితీయమ్ము, రుచికరం బద్భుతమ్ము,
వసుధనోయమ్మ! 'గోంగూరపచ్చ'డొకటి,

* * *

## భామ 'కాటు'

తేలు కాటుకోర్చి తెప్పరిలగవచ్చు
పాము కాటుకోర్చి బ్రతుకవచ్చు
భామ కంటికాటు భరియించలేమయా
విశ్వదాభిరామ వినుర వేమ.

పి. యస్. రంగారావు, (భద్రాచలం)

* * *

## పెద్దమనిషి

ఒక పెద్ద వ్యాపారస్థుడు ఒక సినిమాతారను ప్రేమించాడు; పెళ్ళిచేసుకోవాలని కూడా నిశ్చయించుకున్నాడు. ఎందుకైనా మంచిదని ఆమె పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవాలసిందని ఒక డిటెక్టివ్‌ను పెట్టాడు. ఎలానో తంటాలుపడి అతడు కొన్ని వివరాలు ఆరాతీసి వ్యాపారస్థుడికి ఉత్తరం రాశాడు. అందులో ఇలా ఉంది:

"ఆమె చాలా మంచిదని తెలిసింది. గతంలో ఆమె ఏ తప్పూ చేసిన దాఖలాలు లేవు. స్నేహితులు కూడా పెద్దమనుష్యులే. కాని ఇటీవల కొంతకాలంగా ఆమె ఒక వ్యాపారస్థుడితో తిరుగుతోందనీ, అతనికి అంత మంచిపేరు లేదనీ తెలుస్తోంది."

పి. రామారావు (మద్రాసు)

* * *

## గుమాస్తాకులం

గుమస్తాలం, గుమస్తాలం
కమారమి బ్రతుకులో
సుమారుగా జీవించే
సమ్మంతని 'చౌరస్తా'లో
పేకాటల్లో బేస్తులం

చదరంగంలో మస్తులం
ప్రజానీకానికి నేస్తులం
ప్రభుత్వానికి వేస్టులం
వడ్డీలు పెంచే గేస్తులం
రెడ్‌టేపిజానికి వారసులం
గుడ్ రిమార్కులకి 'బేవారసులం'
మాసిక దుస్తుల వ్యథార్తులం
మాసిన బ్రతుకుల క్షుదార్తులం
రాజ్యాంగానికి శస్త్రాలం
లక్ష్యంలేని అస్త్రాలం
అధికార్లకు ఏకుమేకులం
అదే మాకులం—గుమస్తా కులం

పు. స. ప్రసాద్

* * *

## స్వామిభక్తి

రెండవ ప్రపంచయుద్ధం హోరాహోరీగా జరుగుతున్న రోజులవి. ఉత్తర ఆఫ్రికాలో ఒకచోట బ్రిటిష్ సైనిక దళాలను తనిఖీ చేయడానికి జనరల్ ఐసెన్‌హోవర్ వచ్చారు. స్థానిక సైనికాధికారి ఆయన వెంట తిరుగుతూ వివిధదళాలను చూపుతున్నాడు.

ఇద్దరూ జీపులో ఎక్కి యుద్ధరంగంలోంచి వెడుతున్నారు. ఇంతలో శత్రువుల విమానం ఒకటి రివ్వున వచ్చి బాంబులవర్షం కురిపించి, దూసుకుపోయింది. జనరల్ ఐసెన్‌హోవర్, స్థానికాధికారి టక్కున జీపు ఆపి, దగ్గరలో ఉన్న గోతులోకి వెళ్ళి దాక్కున్నారు.

ప్రమాదం గడిచిపోయాక స్థానిక సైనికాధికారి ఐసెన్‌హోవర్‌కి చేయూత ఇచ్చి బయటకు తీసుకు వచ్చాడు.

"మీకేం దెబ్బలు తగలలేదు కదా!" అతడు ఐసెన్‌హోవర్‌ను ఆదుర్దాగా అడిగాడు.

సైనికాధికారి అభిమానానికి ఐసెన్‌హోవర్ సంతోషించి "నాయందు నువ్వు చూపుతున్న శ్రద్ధకు కృతజ్ఞుణ్ణి" అని అన్నారు.

"ఎంతమాట! మీరు అలా అనుకోనక్కర లేదు. నేను అధికారిగా ఉన్న ఈ ప్రాంతంలో మీకు ఏ ఆపదా రాకుండా చూడాలనే నా ఉద్దేశం" అతడు మొహమాటపడుతూ గొణిగాడు.

వి. నారాయణస్వామి (విజయవాడ) ★




"మీరు ఇలా ఆరు నెలలు కసరత్తు చేశారంటే—ఎవ్వరితోనైనా, ఆఖరికి మీ ఆవిడతోనైనా ధైర్యంగా మాట్లాడగలుగుతారు."




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**2-6-1962 శుక్రవారము మొదలు**
**28-6-1962 గురువారము వరకు**

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ముఖ్యంగా మీవృత్తిలో ఏర్పడుతూఉన్న ఆటంకాలను తొలగించుకొని స్థిమితంగా నిలవగలుగుతారు. బంధుమిత్రులతో కలిసి చేయు పనులు మొదట మీరు అనుకున్నంత విశేషంగా రాణించకపోవచ్చు. ఎప్పటికప్పుడు ధనవిషయంలో సంతృప్తి కనబడుతూ ఉంటుంది. కాని, అందువల్ల ఆరంభించిన పనులకు అభ్యంతరం ఉండదు. విలువగల వస్తువులు కొనగలుగుతారు. కుటుంబంలోనివారితో తరచు అభిప్రాయ భేదాలు వస్తూ ఉంటవి. ఉత్తరదిక్కునుంచి ఉత్సాహకరమైన వార్తలు తెలుస్తవి. ఇంతకు ముందు పెద్దమనుష్యులతో చెప్పిన మాటను నెరవేర్చుకొనటానికి ప్రయత్నించగలుగుతారు. కాని, ప్రస్తుతం పరిస్థితులు అనుకూలించవు. శుభకార్యాలలో నలుగురికి నచ్చచెప్పటం శ్రమ అంగా తోస్తుంది. 24, 25 లలో సుఖభంగము, భవిశేషాలనిమిత్తం ఖర్చులు.

* * *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

వ్యవహారవిషయాలలో ఫలితం సామాన్యంగా ఉంటుంది. కాని, గౌరవప్రదమైన కాలం. శ్రమ అధికంగా ఉన్నా ఉత్సాహంతో పని చేయగలుగుతారు. మీ ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి.

> **గ్రహస్థితి**
>
> మేషంలో అంగారకుడు, వృషభంలో బుధుడు, మిధునంలో సూర్యుడు, కర్కాటకంలో శుక్రరాహువులు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురువు, మకర కుంభ మీన మేష వృషభాలలో చంద్రుడు.

స్వల్పకారణాలకుకూడా మనస్సులో ఆదుర్దా, కోపము అధికమవుతవి. ప్రస్తుతం క్రొత్తపనులలో ప్రవేశించే ఆలోచనలు చేస్తారు. అందుకు గ్రహబలంకూడా అనుకూలంగా ఉంది. ఎవరివల్ల ఏకార్యం నెరవేర్చుకొనవలసివచ్చినా మధ్యలో మరొకరిద్వారా సాధించుకోవలసి ఉంటుంది వృత్తిలో అధికారుల మన్నన లభిస్తుంది. 22, 23లలో కార్యసిద్ధి, ధైనకార్యాలు, గొప్పవారి స్నేహం.

* * *

### మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఎదటివారి గౌరవం నిమిత్తం మీరు ఖర్చు పెట్టవలసిన సమయం. మొదట మీవల్ల స్వల్ప సహాయం కోరినవారు చివరకు సర్వభాధ్యతలు మీమీదికి నెట్టటానికి చూస్తారు. తూర్పుదిక్కు నుంచి లాభవార్తలు వస్తవి. ధనాదాయం బాగానే ఉంటుంది. అయితే ఎక్కువభాగం దుబారాకాగల సమయం. ఎవరు ఏవిషయం చెప్పినా మీరు ప్రత్యక్షంగా తెలుసుకోకుండా కార్యరంగంలో ప్రవేశించ తగినసమయం కాదు. విద్యాభివృద్ధి ప్రయత్నాలు సులభంగా నెరవేరుతవి. ఈ సమయంలో రాజకీయాలలో మనశ్శాంతి ఉండదు. కార్యభారం మితిమీరిపోగల అవకాశాలున్నవి. పిల్లలమూలంగా ఆనందం లభిస్తుంది. నౌకరులు మొదలయిన వారివల్ల మోసము, కార్యభంగము కలిగే సూచనలున్నవి. పుణ్యకార్యాలలో పాల్గొంటారు. 27, 28లలో ఆదాయవృద్ధి, వ్యవహార పరిష్కారాలు, ప్రయాణసూచనలు.

* * *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

బాహ్యవిషయాలలో అనుకూలమైన కాలం. సాటివారిలో గౌరవం లభిస్తుంది. మధ్యమధ్య చీలివచ్చేటట్లు కనుపించి వెంటనే అణగిపోతూఉంటవి. అధికారులవల్ల మీపనులు చురుకుగా సాగిపోతవి స్నేహితుల సలహాలను ముఖ్యంగా గ్రహించతగిన సమయంకాదు. ప్రయాణాలుచేయవలసి వస్తుంది మిమ్ములనుగురించి సంఘంలో అపవాదులు ప్రచారంచేసేవారుంటారు. వృత్తిలో మృదువుగా జరుపుకొందామని ఎంత ప్రయత్నించినా కొన్నిసమయాలలో మాటలు పెరిగే అవకాశాలున్నవి. ఈవారంలో ధనాదాయము, కార్యసిద్ధి వీటిని గురించి ఆందోళన చెందవలసిన అవసరం కనిపించదు. కాని, ఓర్పు లేని మనుష్యులవల్ల స్వల్పవిషయాలలో మనశ్శాంతికి భంగం కలుగుతుంది.

* * *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

దైవబలంవల్ల అనేక ప్రధానసమస్యలు ఈసమయంలో తీరిపోతవి. మంచిమాటలతో అవకాశాన్ని సక్రమంగా ఉపయోగించుకుని గౌరవం పొందగలుగుతారు. అకస్మాత్తుగా ధనం లభిస్తుంది. మీ వృత్తి ఉద్యోగకార్యాలను నిర్వహించుకొంటూ స్నేహితులనిమిత్తం శ్రద్ధతీసుకుని సహాయం చేస్తారు. కుటుంబంలో అనారోగ్య కారణాలవల్ల ఖర్చులుమాత్రమే కాకుండా అశాంతికూడా పెరిగే

అవకాశాలున్నవి. వాహనాలు, ఇండ్లు, భూములు మొదలయినవాటిమీద మీ డబ్బును ఉపయోగించతగిన అవకాశాలున్నవి. వారం రెండవ భాగంలో దక్షిణదిక్కునుంచి లాభవార్తలు తెలుస్తవి. ఒకరిద్దరు బంధువులు మీమాటలకు వ్యతిరేకార్థం తీసుకొంటారు. 27, 28 తేదీలలో అకస్మాద్ధనలాభం, అధికారులస్నేహం.

* * *

## కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ప్రస్తుతం భారంగా కాలం జరుగుతూ ఉంటుంది. ముఖ్యసమయాలలో ధైర్యంగా మాట్లాడలేకపోతారు. అదృష్టం కలిసి వచ్చేటట్లు తోస్తూ ఉంటుంది. కాని, కాలం జరిగిపోతూ ఉంటుంది. ఉపయోగంలేని పనులయందు ఖర్చుపెట్టడం జరుగుతుంది. ఒకపని జరిగిందని అనుకొంటూ ఉండగానే మరొకభారం పైనపడుతూ ఉంటుంది. కుటుంబంలో చిన్నచిన్న విషయాలలో కోపతాపాలు వస్తవి. కోర్టుకచేరీలలో ప్రతిబంధకాలను ఎదుర్కోవలసివస్తుంది. పైకి నిందుదవం తగ్గకుండా కాపాడుకొనగలుగుతారు. అప్పుచేయవలసిన అవసరం రాకుండా చూచుకొనండి. 24, 25లలో శుభకార్య ప్రసంగాలు, ప్రయాణాలు.

* * *

## తుల:

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ఈ సమయంలో మంచితనం అక్కరకురాకపోవచ్చు. చాటున మిమ్ములనుగురించి చెడుగా మాట్లాడేవారుంటారు. కుటుంబంలోకూడా చిన్న చిన్న పేచీలు ఆరంభంకాగలసమయం. సంఘంలో మీస్థానం బాగుంటుంది. తీరుబాటులేకుండా పనిచేయవలసి వస్తుంది. ఆదుర్దా కలుగతగిన వార్తలురావచ్చు. కాని, మీబుద్ధి బలంతో సులభంగా పరిష్కరించుకొనగలుగుతారు. వృత్తిలో జరుగవలసిన పనులు ప్రస్తుతానికి నిలిచిపోతవి. కాని, మరొకవిధంగా మంచి అవకాశాలు లభిస్తవి. వారం రెండవభాగంలో తలవనితలంపుగా అనారోగ్యం చేస్తుంది. విలువగల వస్తువులు పోయే అవకాశాలున్నవి. గౌరవం నిమిత్తం స్వల్పఫలితానికే శ్రమపడవలసి వస్తుంది. 22, 23 తేదీలలో ధనలాభం, బంధువులవద్దనుంచి కష్టవార్తలు.

* * *

## వృశ్చికం:

**(విశాఖ 4వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

సుఖంగా, ప్రశాంతంగా ఉండలేరు. అలాగని చిక్కుపడుతున్నామని అనుకోవలసిన అవసరం కూడా కనుపించదు. మామూలు పరిస్థితులలో ప్రత్యేకమైనమార్పులు ఏవీ ఉండవు. లాభ శుభవార్తలు తెలుస్తవి. వ్యవహారరంగంలో మీమీద తప్పులు వెతికేవారు ఉంటారు. యంత్రాలు, ఆయుధాలు, మొదలయినవాటితో చేయుపనులలో జాగ్రత్తగా ఉండతగిన సమయం. ప్రక్కవారి సలహాలను నమ్ముకుని కలహాలకు సిద్ధపడతగిన సమయంకాదు. విశేషంగా బాధ్యతవహించి ఏపనీ చేయలేరు. కాని, చేయవలసినపనులను గురించి ఆందోళనమాత్రం తప్పదు. పిల్లలమూలంగా ఆనందము, సౌఖ్యము లభిస్తవి. 27, 28 తేదులలో బాధ్యతతోకూడిన పనులు, విశేష ధనవ్యయం.

* * *

## ధనుస్సు:

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

మంచితనంతో కార్యసిద్ధి పొందగలుగుతారు. వృత్తిఉద్యోగాలలో పోటీ, విరోధాలు తొలగిపోయి ఉత్సాహం లభిస్తుంది. రెండుమూడు కార్యక్రమాలు ఒకేసమయంలో నిర్వహించవలసి వస్తుంది. బంధుమిత్రులలో మీయందు గౌరవభావం పెరుగుతుంది. ఒకపని ప్రారంభిస్తే చివరివరకు నెరవేరదనే సందేహం తోస్తూ ఉంటుంది. దైవబలం వల్ల చక్కగా నిర్వహించగలుగుతారు. ఆభరణాలు, వస్త్రాలు మొదలయినవి కొంటారు. వారం రెండవభాగంలో ఆదాయం బాగుంటుంది. వ్యవహార విషయాలలో పట్టుదలలు తగ్గించుకొని ప్రశాంతంగా ఫలితం పొందగలుగుతారు. తలవనితలంపుగా నీచులతో కలహాలురాగల అవకాశాలు ఏర్పడుతవి. సమయానుకూలంగా మీరే సర్దుకొని పోవలసి వస్తుంది. 27, 28 తేదీలలో ఇతరులకార్యభారం అనారోగ్యసూచనలు.

* * *

## మకరం:

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఎప్పటికప్పుడు మీ పరిస్థితులలో హెచ్చుతగ్గులు కనుపిస్తూ ఉంటవి. ఒకప్పూటఉన్న ప్రశాంతత మరొకప్పూట కనిపించదు. స్వయంగా యోచించుకొని మీ వ్యాపార వ్యవహారాలను నడుపుకొనవలసిన సమయం. స్నేహితులు మాటలలో చూపినమంచిని క్రియలో చూపలేకపోతారు. అధికారులవల్ల మేలు కలుగుతుంది. కుటుంబంలో సుఖశాంతులు లోపించగల అవకాశాలున్నవి. దైవానుగ్రహంవల్ల ఇతరులవద్దనుంచి ధనసహాయం ఎదురుచూడవలసిన అవసరం క్రమక్రమంగా తగ్గుతుంది. పడమరఉత్తర దిక్కుల నుంచి శుభవార్తలు తెలుస్తవి. బంధువులకు సంబంధించిన కార్యభారం పైనపడుతుంది. 24, 25 తేదీలలో సంతోషవార్తలు, గొప్పవారి స్నేహం.

## ఈ వారము ధరలు

బంగారుధర 26 నుంచి బాగాపెరిగే అవకాశాలున్నవి. వెండిధర ఈవారం అంతా తేజీలో నిలుస్తుంది. పసుపు ధరలో మందీ వస్తుంది. కందులకు గిరాకీఆరంభం అవుతుంది. నూవులధర మొదట మందీవస్తుంది. కాని వారం చివరలో తేజీ రాగల అవకాశాలున్నవి. వేరుశనగపప్పుధర 25 పైగ వెంటవెంటనే హెచ్చుతగ్గులు వచ్చే సూచనలున్నవి. మిర్చిధర మందంలో ఉంటుంది.

## కుంభం:

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ముందుముందు స్పర్థలురాకుండా నిష్కర్షగా మాట్లాడవలసివస్తుంది. శ్రమపడి పనిచేసి ఫలితం చేతికివస్తుందనుకొనేసమయంలో ఇతరులకు వప్పగించటం జరుగుతుంది. స్నేహితులు మీఎదుట అనుకూలంగా మాట్లాడినా పరోక్షంలో వ్యతిరేకంగా పనిచేస్తారు. మనోబలంతో అసాధ్యంగా కనుపించే వ్యవహారాలను ఒకదారికి తీసుకునివస్తారు. వృత్తిలో ముందుగా మీచేతులనుంచి పెట్టుబడిపెడితేగాని పనిసాగనిస్థితి ఏర్పడుతుంది. వారం రెండవభాగంలో శత్రుబాధ కనుపిస్తుంది. అయితే ప్రత్యక్షంగా అపకారం జరుగకుండా జాగ్రత్తపడగలుగుతారు. పుణ్యకార్యాలు జరుగుతవి. మనస్సంతృప్తిమాత్రం తక్కువ. పరిస్థితులు గ్రహించకుండా మాట్లాడే వారిని సమాధానపరచటం చిక్కుసమస్యగా తయారు అవుతుంది.

* * *

## మీనం:

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

"తమకుతోచదు, ఒకరు చెబితే వినరు." అనే రకంమనుష్యులతో అవస్థపడవలసి ఉంటుంది. సాధారణంగా వాదప్రతివాదాలలో మీదే పైచేయి అవుతుంది. ఒక్కొక్కసమయంలో అతిస్వల్ప ఫలితం కనుపించినా మొత్తంమీద రావలసినదానికన్నా అధికంగా పొందగలుగుతారు. ముందుగా వివరం తెలుసుకోకుండా చేసిన వ్యవహార కార్యాల మధ్యలో చిక్కుపడి తిరిగి కొనసాగించడం జరుగుతుంది. క్రొత్తమిత్రులు లభిస్తారు. బంధుమిత్రులతో మాట్లాడేసమయాలలో ఉద్రేకాన్ని తగ్గించుకోవటం అవసరం. ఎప్పుడూ ఏదో ఒకపని చేస్తూ ఉంటారు. ప్రయాణాలు సులభంగా జరుగకపోవచ్చు. 27, 28 తేదీలలో ఆదాయాభివృద్ధి, సందేహాలు విశేషం. 

# జీవకణముల వృద్ధి: పునరుత్పత్తి

డా॥ గాలి బాలసుందరరావు

జీవకణములో 'ప్రోటోప్లాజము' సైటోప్లాజమని న్యూక్లియోప్లాజమని రెండు భాగములుగా ఉంటుంది. న్యూక్లియస్‌లో న్యూక్లియోలస్ అనేభాగం ఉంటుంది. ఒక్కొక్కప్పుడు రెండు న్యూక్లియోలస్‌లుకూడా ఉంటవి.

న్యూక్లియస్ గుజ్జులో "క్రొమేటిన్" అనే వస్తువుతో తయారైన నిర్మితి వున్నది. ఈ క్రొమేటిన్ కొన్నిరంగులను హరించుకునే గుణంకలది. రసాయనికంగా ఇది ఒకరకమయిన న్యూక్లియోప్రోటీను. న్యూక్లియోలస్‌లో వుండే వస్తువు ఫాస్ఫోప్రోటీను (అంటే భాస్వరము ప్రోటీను కలిసి ఏర్పడ్డ వస్తువు).

సైటోప్లాజములో చాలా రకము లయిన ఎంజయిములు లున్నవి. క్రొమేటిన్‌వలలో క్రోమోజోములు అన్న నిర్మితులున్నవి: ఇవి ఒక్కొక్క జంతుజాతిలో ఒక్కొక్క సంఖ్యలో ఉంటవి. మానవుల్లో 24 జతలుగా ఉంటవి. ఒక్కొక్క క్రోమోజోములో కొన్ని "జెనీలు" అనే సూక్ష్మ నిర్మితులు ఉంటవి. వీటిసంఖ్య ఇంకా శాస్త్రజ్ఞులు నిర్ణయించలేదు. జీవకణమనే సామ్రాజ్యానికి ఈ జెనీలు పాలనాధికారులు అనవచ్చును. జీవకణంలో జరిగే కార్యకలాపమంతా, ఈ జెనీల ఆదేశానుసారమే జరుగుతూ ఉంటుంది. రసాయనికంగా ఈజెనీల దేహమంతా ఒకేఒక, డెసాక్సి పెంటోజ్ న్యూక్లియో ప్రోటీన్ మాలిక్యూలుతో యేర్పడింది. (Desoxy Pentose Nucleo Protein Molecule)

జీవకణం సైటోప్లాజంలోవుండే ఎంజయిముల ప్రభావంచేత అందులో ప్రవేశించిన ఆహార వస్తువులు జీవకణంలోవుండే అన్నిభాగములు తయారుకావడానికి వినియోగింపబడతవి. ఈ వినియోగమూ, పునఃసృష్టి కూడా జెనీల ఆధీనంలో ఉంటవి. ఈ వస్తువులే, జీవకణకార్యక్రమంలో వినియోగింపబడి నశిస్తూవుంటవి. అయితే వీటి వినియోగంకంటే ఉత్పత్తి అధికమైనప్పుడు జీవకణము వృద్ధిచెంది పెద్దదౌతుంది. ఏ జీవకణమూ ఒక పరిమాణాన్ని మించి పెరగదు. ఈగరిష్ఠ వృద్ధి ఒక్కొక్కరకం జీవకణంలో ఒక్కొక్క రకంగా వుంటుంది. ఆహారం లభిస్తున్నకొద్దీ జీవకణం అంతకంతకు అపరిమితంగా పెరిగి పెద్దదికాకుండా నిలిపివేసే కారణం యేమిటి? అన్నప్రశ్న శాస్త్రజ్ఞులను ఎదుర్కొన్నది.

జీవకణం పెద్దదయినకొద్దీ దాని [illegible] అధికమౌతుంది. అట్లాగే దానితోపాటు [illegible] మాణమూ అధికమౌతుంది. పైపొరనుండి లోపలికి అన్నీ రావాలిగదా. జీవకణం ఘనపరిమాణం పైపొర వైశాల్యంకంటే అనేకరెట్లు పెరిగినప్పుడు, అందులో లోపలిభాగములకు ఆహారమూ ఆక్సిజనూ అందదు. అప్పుడు జీవకణంవృద్ధి ఆగిపోతుంది.

జీవకణం వృద్ధిచెందినకొద్దీ, క్రోమోజోములలో ఉండే జెనీలుకూడా వృద్ధిచెందుతూ ఉంటవి. జెనీలు పెరగంగానే అవి పరిపాలించడానికి క్రొత్త ప్రదేశాలు కావాలి. వాటి ఆదేశానుసారంగా జీవకణం విభజన పొందుతుంది.

జీవకణం విభజన రెండురకములు : 1. ఎమైటోసిస్.(Amitosis) 2. మైటోసిస్(Mitosis). మైటోసిస్‌కానిది ఎమైటోసిస్. మైటోసిస్‌లో న్యూక్లియస్ అనేకదశలుగా రెండుభాగములైన తరువాత సైటోప్లాజము రెండుగా విడిపోతుంది. ఎమైటోసిస్‌లో అట్లాకాదు. ముందు సైటోప్లాజంలో గాడి ఏర్పడి, క్రమంగా లోతయి, జీవకణం న్యూక్లియస్‌లోకి చొచ్చుకొని జీవకణం రెండుగా విడిపోతుంది. ఈవిధంగా తయారయిన కుమారకణములు, మాతృకణంకంటె చిన్నవిగా ఉంటవి. అయినా కొద్దికాలంలోనే అవి మాతృకణములతో సమానంగా వృద్ధిచెంది పెద్దవౌతవి. ఇటువంటి విభజన రక్తంలో శ్వేతాణువులలోనూ, అస్థిజీవకణములలోనూ మూత్రపుసంచీ (Bladder) లోపలిపొరలోనూ జరుగుతూ ఉంటుంది.

శరీరం ఇతరభాగములలో జీవకణవిభజన ఈవిధంగా ఉండదు. అది అనేకదశలలో జరుగుతుంది. ఈవిధమైన జీవకణవిభజనకు 'అరగంటనుంచి రెండుమూడు గంటల కాలందాకా పట్టవచ్చును.

జీవకణం విభజనకు ప్రధానకారణములు రెండు: 1. తగినంత ఆహారం 2. ఆ యా జీవకణములకు ఉన్నపని. జీవకణములలో పని అధికం అయినదంటే అందులో విద్యుద్రసాయనిక విక్షుతులూ దానితో వేడి అధికమయినవన్న మాట. ఇవన్నీ జీవకణమును ఇరిటేట్‌చేసి నాశనం చేస్తవి. అధికనాశనంవల్ల జీవకణసంఖ్య తగ్గి కార్శ్యము (చిక్కిపోవడం) ఏర్పడకుండా జీవకణములు విభజనపొంది వృద్ధిచెందుతవి.

ఎమైటోసిస్‌లో, మాతృజీవకణంలో భాగములు సమానంగా కుమారకణములకు పోవు. కాని "మైటోసిస్"లో మాతృకణంలో ప్రతిభాగం పరిసమానంగా కుమారకణములకు సంక్రమిస్తుంది.

"మైటోసిస్" ప్రకారం జీవకణవిభజనలో నాలుగుదశ లున్నవి.

1వ దశ: ఇందులో న్యూక్లియస్‌లో న్యూక్లియోలస్ అంతరిస్తుంది. క్రొమాటిన్‌వల విడివడి ముక్కలుముక్కలై, ఆముక్కలు జంటలుగా ఏర్పడతవి. ఆజంటలో భాగమును క్రోమేటిడ్ (Chromatid) అంటారు. వీటిలో సగం మాతృభాగము, సగం పితృభాగమునుంచి వస్తవి. ఈ క్రోమోజోములసంఖ్య 46 అని కొందరు శాస్త్రజ్ఞుల మతము. క్రోమోజోములు విభజనపొందుతున్నప్పుడే, న్యూక్లియస్‌ను అంటివుండే రెండు సెంట్రోజోములు (Centrosomes) విడివడి, చెరిఒకప్రక్కకూ కదిలి న్యూక్లియస్ రెండుకొనలలోను నిలిచిపోతవి. ఈ రెంటిమధ్య సన్నని క్రొమాటిన్ తంతువులు, నాలుకండె ఆకారంలో ఏర్పడతవి. ఈస్థితిలో న్యూక్లియస్‌మీద పొర అంతరించిపోతుంది. ఇది మొదటిదశ. రెండవదశలో క్రోమోజోమ్‌ఖండములు దగ్గరించుతవి. ఈ స్థితిలోవున్న క్రోమోజోము ఖండములను సెంట్రోమియరులు అంటారు. (Centromeres)

మూడవదశలో సెంట్రోమియరులు (క్రోమోజోము ఖండములు) మళ్ళీ నిలుగా రెండవుతవి. ఈ క్రొత్తజతలకు పాతజతలకు మధ్య ఒక వైముఖ్యం ఏర్పడుతుంది. వీటి రెంటిమధ్య ఒకేరకమయిన ఛార్జిఉండడం ఈ వైముఖ్యమునకు కారణం కావచ్చును. ఈ వైముఖ్యంవల్లనో, జీవకణం రెండుకొనలకూ పోయి నిలిచిన సెంట్రోసోములకూ ఈ సెంట్రోమియరు ఖండములకూ మధ్య ఒక ఆకర్షణ ఏర్పడడంవల్లనో, సెంట్రోమియరులు సెంట్రోజోములచుట్టూ గుమిగూడుతవి. ఈ రెండుగుంపులలోనూ, ఆది జీవకణం (శుక్లశోణిత సంయోగంవల్ల ఏర్పడ్డది)లో ఉన్న మాతృపితృభాగములనుంచి వచ్చిన జెనీలు సమానంగా ఉంటవి. ఆవిధంగా ప్రతి జీవకణవిభజనలోనూ, మాతృపితృలక్షణములు రోగలక్షణములతోసహా కుమారకణములకు సంక్రమించుతవి.

నాలుగవదశలో ఈ క్రోమేటిడ్ ఖండములన్నీ మళ్ళీ కలిసిపోతవి. ప్రతిసెంట్రోసోమ్ (Centrosome) సమీపంలోనూ ఒక న్యూక్లియోలసు(Nucleolus) ఏర్పడుతుంది. వీటన్నింటినీ చుట్టి, ఒక న్యూక్లియస్‌పొర ఏర్పడుతుంది. సైటోప్లాజంలో గాడి ఏర్పడి అంతకంతకులోతై, రెండుకొత్త న్యూక్లియస్‌ల మధ్యగా కలుసుకుని రెండు విభిన్న స్వతంత్ర కుమారజీవకణములు ఏర్పడతవి. ఈ పద్ధతి సాధారణ జీవకణములలో ఈవిధముగా ఉంటుంది. శుక్లశోణితకణముల సంయోగం వల్ల యేర్పడిన పిండకణములో (Zygde) ఈ నాలుగు దశలలోనూ ఉపదశలు ఉంటవి.

—37వ పేజీ చూడండి

# ఇద్దరు అబలలు

## దర్భా భాస్కరం

మెటర్నిటీవార్డులో నైట్‌డ్యూటీచేస్తున్న నర్సు రాధ: రాత్రి పన్నెండుగంటలు దాటిన ఆ వేళప్పుడు—'రోగుల్నందర్నీ' నాలుగోసారి సవిరించుకొని కారిడర్ పక్కని కిటికీ దగ్గర స్టూల్ వేసుకొని కునికిపాట్లు పడుతోంది. రోగులు! రోగులు! — వీళ్ళు రోగులెట్లా అయ్యారో ఆమెకి అర్థంగాదు. ఏవార్డులోనో అయితే రోగులనబడే పేషెంట్లు నిజంగా రోగంతో వచ్చివుంటారు. ఈ మెటర్నిటీవార్డులో చేరినవాళ్ళు రోగులెట్లా అవుతారు! చక్కగా పెళ్లిళ్ళు చేసుకొని, సుఖంగా భర్తల్తో కాపరాలుచేస్తూ, అందరి అభిమానాల్నీ, ఆశీస్సుల్నీ చూరగొంటూ,—కనడానికి వస్తారు, హాస్పిటల్‌కి. బంధువుల్ని, అభిమానించేవాళ్లని, ఈ పురిటిరొంపి చాకిరీలో దింపకుండా ఉండటానికి, "డబ్బు పారేసి" సుఖంగా ప్రసవించడానికి, డాక్టర్ల జ్ఞానాన్నీ, నర్సుల చాకిరీని కొనుక్కోడానికి, హాస్పిటల్‌లోకి తయారవుతారు!— ఇది కాస్త అవగానే ఎవరిదార్ని వాళ్ళు, బోసినవ్వుల్తో కంకల్లాడే పిల్లల్ని ఎత్తుకొని, ప్రేమ ఫలాన్ని చూపించుకొని ప్రేమని పొందడానికి ఎవరి గూట్లోకి వాళ్ళు వెడతారు. డబ్బిచ్చి కొనుక్కున్న ఈ డాక్టర్ల జ్ఞానంగాని, నర్సుల సేవగాని ఎవరికి—ఎంతోకాలం జ్ఞాపకం ఉండవు!—పిల్లనిట, ప్రేమించాలిట!— ఛీఫ్ నర్సన్ శీలవ్ చెప్పే మాటలు రాధ మనస్సులో మెదిలేయి "......నువ్వు చేసేపని—తల్లికి బిడ్డని చూపిస్తున్నావు: అంటే లోకంలో అన్నిటికన్నా ఉత్కృష్టమైన ప్రేమకి బీజం వేస్తున్నావు. ఇది ప్రేమించడంద్వారా మాత్రమే సాధ్యమమ్మా. ఇక్కడ ఉద్యోగంచేస్తున్నానన్నమాట ఎంత త్వరగా మరిచిపోతే అంత మంచిది: ప్రేమించు. తల్లిని ప్రేమించు; పిల్లని ప్రేమించు. ఏ ప్రేమే ఆ తల్లీ పిల్లలమధ్య వృద్ధిచెందేటట్లు ప్రేమించు"

"రాధా!' వీపుమీద చెయ్యిపడింది.

బోడు చప్పుడేనా వినిపించలేదు రాధకి. నైట్ డ్యూటీ డాక్టరు మిస్ కమల హఠాత్తుగా వచ్చి తట్టింది.

'ఎస్, మేడమ్' రాధ కంగారుగా లేచినించుంది.

'రౌండ్స్ అయిపోయాయా?'

'అయిపోయాయి మేడమ్."

"ఆ ఇరవైఆరోబెడ్ అమ్మాయి కెలా ఉంది?'

'ఇంప్రూవవుతోంది మేడమ్.'

'జాగర్తగా కనిపెట్టుండు—ఏం?'

'ఎస్, మేడమ్'

బోడు చప్పుడుచేసుకుంటూ వెళ్ళిపోయింది డాక్టర్. కారిడర్ పక్కన ఆవిడకి రెస్టురూమ్ ఉంది. అందులో పడుకుంటుంది, హాయిగాను. రాధకి తెలుసు. అలా చూస్తూ నించుండిపోయింది.

బాధ్యతలు, బాధ్యతలు! "జాగర్తగా కనిపెట్టుండు!", "బి కేర్‌ఫుల్!"—హాస్పిటల్స్‌లో అంతా జాగ్రత్తగానే ఉండాలి. ఉంటారు కూడాను. లేబిల్ చూడకుండా, నెంబరు చూడకుండా మందులు పోసేస్తే బెడ్ దావంతటదే ఖాళీ అయిపోయింది. అంతా అతిజాగ్రత్తగానే ఉంటారు. అయినా తమాషాలు జరుగుతూనే ఉంటాయి; ప్రమాదాలూ జరుగుతాయి. పిల్లల్ని స్నానాలు చేయించేటప్పుడు మార్పిళ్ళు జరగటంలాటివి. ఎక్కడో ఏదో హాస్పిటల్లో మెటర్నిటీ వార్డులో ఉరకుక్క ప్రవేశించి ముప్పయ్యారుగంటల వసికందును సగం బిడ్డని తినేసిందట—ఆవార్త తెలిసేక ఈ హాస్పిటల్లో ఓ చిన్న అలజడి రేగింది. ఛీఫ్ నర్సు రోజుకి నాలుగైదుసార్లు మెటర్నిటీవార్డుకొచ్చి తలుపులు సరిగ్గా వేస్తున్నారా లేదా అనీ, నైట్ డ్యూటీవాళ్ళు నరూ నిద్రపోడంలేదుగదా అనీ, జాగర్తపడి వెళ్లేవాడు, ఓ పదిరోజులపాటు వరుసగా.

"సిస్టర్!' ఎక్కణ్ణుంచో నీరసమైన కేక.

జవాబు చెప్పకుండా నడిచి అటు వెళ్తోంది రాధ.

'సిస్టర్!' మళ్లీ నీరసంగా విన్పాయంగా పిలుపు.

"యస్, ప్లీజ్—ఏమమ్మా, ఏం కావాలి?'

ఇరవైఆరోనెంబరు బెడ్‌మీద పేషెంటు—'ఇక్కడ కూచోండి—చాలా బాధగావుంది—' అంది.

'ఫర్వాలేదమ్మా. తగ్గిపోతుంది.'

"కూర్చోండి సిస్టర్—'

"అట్లా నీ ఒక్క బెడ్ దగ్గిరా కూర్చుంటానికి వీల్లేదమ్మా—'

"ఊఁ—" మూలిగింది పేషంటు. "నన్నెందుకు బ్రతికించారూ—?"

"తరవాత చెబుతార్లేవమ్మా, పడుకో—"

"......నాలాంటివాళ్ళు బ్రతక్కపోతే లోకానికి వెలితా?—"

"ఇప్పుడవన్నీ దేనికిలేమ్మా. నిద్రపో—ఎవరు లేకపోయినా, లోకానికి వెలితిలేదు. అందరూ వుంటేనే లోకం అవుతుంది. బాధకి వెరిచి, చనిపోడం పిరికితనంగదమ్మా"

"—పిరికితనం! — గత్యంతరం లేకపోతే ఏం చెయ్యాలమ్మా.'

'బతికుంటే గతి ఉంటుంది—నీ కడుపులో పాపే నీ గతి చెబుతాడు.'

'—అట్టా' డాక్టర్ని పిలవ్వమ్మా.'

'—ఇంకా టైము కాలేదమ్మా. కాసేపు నిద్రపో.—'

* * *

'పాపేమంటున్నాడు?—' పనిమీద వార్డులో నడుస్తూ, ఇరవైఆరో బెడ్‌మీదున్న అమ్మాయిని అడిగింది రాధ.



'సిస్టర్ని చూస్తానంటున్నాడు—' నవ్వింది పేషెంటు.

'ఊహూ' అలాగేం? — లోకమంతా చూస్తానంటంలే?—' రాధకి కూడా నవ్వొచ్చింది. చేతులో మందుసీసా పట్టుకుని ఒక్కనిమిషం ఆగుతానన్నటు నిలబడింది.

"మీ మేలు మరిచిపోలేము సిస్టర్—చావు బ్రతుకులమధ్య, కాంక్షా వైరాగ్యాలమధ్య నలిగిపోయి కొట్టుకుంటున్న నాకు ఈ బంగారుబాబుని ప్రసాదించి మళ్లీ నన్ను మనిషిని చేశారు—మీరు అంత శ్రద్ధతో అంత శ్రమపడి చెయ్యకపోతే ఈపాటికి నే నెక్కడుండేదాన్నో—'

"ఏం, పెద్ద చెయ్యలేదు లేవమ్మా—అదంతా మా డ్యూటీయేగా!"

"అంతా డ్యూటీ ఎలా అవుతుంది సిస్టర్—ఏదో ఓ ప్రత్యేకమైన అభిమానం ఉంటుకుని చేసేరు. మా వాళ్లెవరో దగ్గిరుండి అన్ని ఉపచారాలూ చేస్తున్నట్టుందిగాని పరాయిస్థలంలో, ఓ ఆసుపత్రిలో ఉన్నట్టు లేనేలేదు, నాకు! — నామీద మీ కెందు కింత అభిమానం?"

"పోనీ అలాగే అనుకోండి—" రాధ నవ్వింది. మా కందరూ ఒకటేనమ్మా. ఎవరిమీదా ప్రత్యేకమైన అభిమానం ఉండదు. ఆపదలో ఉంటారు కాబట్టి ఎవరు ఏ స్వల్ప పరిచర్య చేసినా మా పేషంట్లందరికీ అలా అనిపిస్తూ ఉంటుంది — 'హఠాత్తుగా పేషంటు మొహం చూసింది రాధ— ఆదేమిటమ్మా ఏడుస్తున్నావా?— కన్నీళ్ళు పెట్టకమ్మా, టెంపరేచరొస్తుంది—"

పేషంటు కన్నీళ్ళు వొత్తుకుంది. అప్యాయత చూపినప్పుడల్లా ఏవో జ్ఞాపకాలు నన్ను బాధిస్తుంటాయండీ!—"

పేషంటు తన వృత్తాంతం చెప్పబోతోందని గ్రహించింది రాధ. "ఒస్తానమ్మా. రెస్టు తీసుకో.... ఈ దోప్ యాభై ఎనిమిదో బెడ్ పేషంటు కివ్వాలి' అని చకచకా నడిచి వెళ్ళింది.

* * *

"అబ్బ! ఈ మందేమిటమ్మా, నా జీవితంలాగే ఇంత చేదుగాఉంది!" మందు తాగేసి, చిన్న నవ్వుతో అడిగింది, ఆ పేషంటు.

రాధకి నవ్వొచ్చింది. 'తియ్యటిమందూ, కమ్మటి జీవితం, కావాలనుకుంటేమాత్రం అందరికీ దొరుకుతాయా ?'

"సిస్టర్ విచిత్రంగా మాట్లాడుతున్నారివాళ—"

"చిత్రమైన మాటకి విచిత్రమైన సమా



# ఇద్దరు అబలలు

ధానం—నే నామాత్రం ఊహించలే దనుకున్నావా?' అని ఛార్టు వేపు చూసి—'రజియా; నీ పేరు!—రజియా! ఎవరో నిన్ను అన్యాయం చేసేరు! అవునా?—ఆవేశంలో తప్పటడుగు వేసేవు......?'

"అవును సిస్టర్—అప్పటి కది తప్పటడుగని అనిపించలేదు—ఆ పాపానికి ఈ ఫలం—అయినా నా కీ బిడ్డమీద ఇంత మమకారం కలుగుతోందేమీ, అని తెల్లబోతున్నాను!'

రాధ మళ్లీ నవ్వింది. 'అది సృష్టిలోనే ఉందమ్మా. తల్లికి ద్వేషించటం చాతవదు!"

"—నా క్లాస్‌మేట్, అతను — క్రిష్ణ—మన మిద్దరం ఒకటన్నాడు, మతాలన్నీ ఒకటన్నాడు. పదిహేనురోజుల్లో నే నతనికి మొహం మొత్తాను. కనిపించడమే మానేశాడు. రెండునెల్లు కాలరిగేటట్టు తిరిగి, కళ్ళు కాయలుకాసేటట్టు చూశాను. ఈలోగానే మా బంధువుల్లో ఓ అబ్బాయితో పెళ్ళి స్థిరపడింది......నా కడుపులో ఏదో కదుల్తోందనీ, అది మా ప్రేమఫలం కాబోతూందనీ తెలుసుకుంటున్న రోజులవి. క్రిష్ణ వస్తాడు; నన్ను ఎప్పటికైనా స్వీకరిస్తాడనీ నమ్మకం చెరగని రోజు అవి......మెదలకుండా పెళ్లికి ఒప్పేసుకుంటే ఆపద గడిచిపోతుంది. సంఘందృష్టిలో నాకు భర్తా, నా పాపకి తండ్రీ దొరుకుతాడు......కాని ఒకరి చేతుల్లో మోసపోయి, అది కప్పిపుచ్చుకోటానికి ఇంకొర్ని మోసంచెయ్యడానికి ఇష్టంలేకపోయింది. ఇల్లువిడిచి వచ్చేశాను—చదువు ఉంది. తగుమాత్రం నగలున్నాయి; ఉద్యోగం కోసం ఎంతో తిరిగాను. కాని, దినదినం అభివృద్ధిచెందుతున్న నా పాపఫలం — దాని బాహ్యస్వరూపం చూసి లోకులు వేరేవిధంగా గుర్తించారు. ఒకరిద్దరు అన్నారు కూడాను—నాబోటి శీలంలేని మనిషి ఏ ఆఫీసులో పనిచేస్తే ఆ ఆఫీసుకే అప్రదిష్ట అని! ఆరునెలలు గడిచాయి. నగలన్నీ కరిగిపోయాయి; గర్భమేమో నిండింది. ఎక్కడికీ వెళ్ళడానికి తోచలేదు....... ఈ నిందా, కష్టమూ మోసేకంటే చావాలనిపించింది......"

రాధ నిశ్శబ్దంగా వింటూ నించుంది. ఆమెకి తెలియకుండా కనుకొలకుల్లోంచి రెండశ్రువులు రాలాయి.

"రజియా!......"

"........"

"నా కొక్క వాగ్దానం చెయ్యాలి నువ్వు!"

"నేనా—?"

"నువ్వే—ఎప్పుడూ ఆత్మహత్య చేసుకోడానికి తలపెట్టనని—మాటియ్యి"

"..........."

"దీనికే ఇంత ఆలోచనా? — ఆత్మహత్య చేసుకుంటే—ఈ బాబేమవుతాడో తెలుసా?—"

"దిక్కులేనివాడవుతాడు—"

"వాణ్ణి దిక్కులేనివాణ్ణి చేయ్యడానికి నీకు హక్కులేదు—"

ఏదో చిరకాలపరిచితుల్లా మాట్లాడేసుకుంటున్న వాళ్లిద్దరికీ డాక్టరు రాక తెలియలేదు!

"రాధా! — ఓ! ఏదో మాట్లాడుకుంటున్నారే! ఎలా వుంది పేషంటు?—ఏదీ ఛార్టు?"

డాక్టరుకి నమస్కరించింది రజియా.

* * *

"నిన్నివాళ డిశ్చార్జి చేస్తున్నారు రజియా!— రాధ పిలుపు విని ఉలిక్కిపడింది రజియా.

"ఆఁ—? డిశ్చార్జి చేస్తున్నారా?" అని తెల్లబోయింది.

రాధ నవ్వింది. "ఏం, ఇక్కడే ఉండిపోదామనుకుంటున్నావా?—నీకూ, మీ బాబుకీ ఆరోగ్యం చేకూరింది. ఆస్పత్రి రూల్సు ప్రకారం మీ రిక్కడ ఉండక్కర్లేదు."

రజియా మొహంలో 'ఎక్కడికి వెళ్లను—?' అన్న భయం ప్రస్ఫుటంగా రూపం పొందింది.

"నా బిల్ ?—"

"నువ్వు హాస్పిటల్‌బైట స్పృహతప్పి పడున్నప్పుడు నీదగ్గిర నూటఇరవై రూపాయ లున్నాయి. నీ బిల్లు నువ్వు ఇచ్చుకున్నావు—"

"నే నెక్కడికి వెళ్లను సిస్టర్—?"

"ఏమో—?"

"ఏమో!—"

రాధ ఆమె నిశ్శబ్దాన్ని భరించలేకపోయింది.

"మీ తల్లిదండ్రులులేరా?"

"ఎందుకులేరు సిస్టర్—తల్లిదండ్రులూ, ఆరుగురన్నలూ—కాని వాళ్లకి మొహం చూపించే ధైర్యం గాని, అవకాశంగాని నాకు లేవు"

"నీ క్రిష్ణ దొరుకుతాడేమో?"

"ఇంకెక్కడి క్రిష్ణ?—అతను బెంగాల్ పారిపోయాడు. అక్కడెక్కడో కులాసాగా కాలక్షేపం చేస్తున్నాడు, భార్యామణితో—"

"మరైతే ఎక్కడికి వెళ్తావ్?"

రజియా మాట్లాడలేదు. మౌనంగా బిడ్డని పొదువుకుని వేదనంతా ముఖంలో ఉన్నా, పెదవుల్లో అమృతంతో వాణ్ణి ముద్దులాడింది. "నా చిన్ని బాబూ, పుట్టకముందే నీకు కష్టాలు ప్రారంభమయ్యాయిరా" అని విలపించసాగింది.

రాధ మరో పేషంటుదగ్గిర పనిచూసుకొని వచ్చేసరికి ఇంకా రజియా ఏడుస్తూనేవుంది. "ఎంతపని చేశాను నేనూ!—"అనుకుంటూనే రజియా దగ్గిరి కొచ్చింది. వీపుమీద చెయ్యివేసింది. వెయ్యి కంఠాలతో మనస్సు ఆమెని వారిస్తోంది. "ఇది అనవసరపు బాంధవ్య"మని నచ్చజెప్తోంది. రాధ చిరునవ్వుతో "రజియాజీ!" అంది.

రజియా లేచి భయంగా చూసింది. "ఇప్పుడే వెళిపోవాలండి?"

"ఇప్పుడే వెళ్దాము, రా!"

"ఒక్క రెండురోజులు టయిమ్ ఇప్పించండి. నే నేదీ ఆలోచించుకోలేదు."

"ఏం ఆలోచించక్కర్లేదు. మా ఇంట్లో ఉందువు గాని, పద"

రజియా మాట్లాడలేకపోయింది. వెయ్యి సందేహాలు ఆమె కళ్లలో విజృంభించాయి. అవన్నీ రాధ చిరునవ్వుతో సమసిపోయాయి.

* * *

"సిస్టర్!"

రాధ నవ్వింది.

"సిస్టరంటే అక్కా......"

"అవును సిస్టర్"

"నన్ను అక్కా అని పిలుస్తే సంతోషిస్తాను"

"తప్పకుండా అలాగే పిలుస్తాను. అక్కా!"

"ఏం చెల్లీ?"

"నా సందేహం లేవీ తీరలేదు—"

"సందేహాలు పుట్టడం ధీరువుల లక్షణం—"

"నన్నెంతకాలం భరిస్తారు?"

"ఇక్కడుండడం నీకు కష్టంగా ఉందా?"

"అంతమాట నే ననగలనా? పుట్టింట్లో కూడా ఇలా జరగదు, ఎవరికీనూ."

"మరి—?"

ఏదో చెబుతుంది. ఎలాగో సంభాషణ మళ్లిస్తుంది. అసలు ఇంట్లో ఏం అడిగేందుకూ మనిషి దొరకదు. ఉదయమే వెళ్తుంది. ఒంటిగంట కొస్తుంది. మళ్లీ నిద్రపోయి లేచి ఆపనీ ఈపనీ చేసుకొని రాత్రి వెళుతుంది. నైట్‌డ్యూటీ షిఫ్టు మళ్లీ ఈవారంకూడా రాధదేలా వుంది. పొద్దుట కూడా కన్సల్టింగ్ డిపార్టుమెంట్లో పని ఉంటోంది.

పొద్దుటే తల్లితోబాటు లేస్తారు; ఇద్దరు అబ్బాయిలు. రామకృష్ణుల్లా ఉంటారు. నీలం నిక్కర్లూ తెల్లటి చొక్కాలూ కట్టుకొని వెళిపోతారు. పిశాలు వల్లెవేసుకుంటూ పదిమంది సందడితో సాయంత్రం వస్తారు. వాళ్లకి భోజనం పట్టుకెళ్లేమనిషి మాణిక్యం — ఆమే హోటల్నించి పెద్ద కేరియర్‌తెచ్చి అందరికీ అన్నం సర్ది పెడుతుంది.

రజియా వచ్చినదగ్గర్నుంచి అన్నంకోసం వేరేగిన్నె పట్టుకెళ్తోంది మాణిక్యం.

"మోహన్‌బాబూ!"

"ఇదుగో వచ్చేనమ్మా—"

"తమ్ముడేడీ?—"

"బట్టలేసుకుంటున్నాడమ్మా."

"తొందరగా రమ్మను. పరీక్ష లెప్పుడు?"

"సోంవారంనించి."

"జాగ్రత్తగా చదువుతున్నారా?"

"చదువుతున్నావమ్మా."

"పిన్ని చెప్పినట్టు వినండి. ఏమేనా తెలియక పోతే పిన్ని నడగండి. నాకు శ్రమవుతోంది; వెడుతున్నా."

"అలాగేనమ్మా."

రోజులు, రాత్రులు గడుస్తున్నాయి. తెలియకుండా గడుస్తున్నాయి. రోజులు తెలియకుండా గడిస్తే కష్టంలేకుండా గడిచిపోతున్నట్టు లెఖ్కట. కాని, రజియా నిశ్శబ్దాన్ని ఎదుర్కో లేకపోతోంది. సందేహాలకి తట్టుకోలేకపోతోంది. ఉదరస్త్రై పరీత్యాన్ని భరించలేకపోతోంది.

"రజియా—"

"ఏమక్కా?"

"మీవాడి పేరేమిటమ్మా?"

"నువ్వుపెట్టు అక్కా—నీమాట కెదురు చెప్పను—నువ్వేదంటే అదే—"

"—కిరణ్ —అందా మనుంది—నీ జీవితానికి వాడే ఒక కాంతికిరణం—నచ్చిందా?"

"నచ్చిందక్కా—ఒక్కమాట అడగనా?"

"అడుగూ."

"నే వెన్నాళ్లు ఇలా ఉండడం?—బావగారు వస్తే బాగుండదేమో"

"ఏ బావగారు?"

రజియా నవ్వింది. "ఇంకే బావగారు?—మీ—"

రాధ మొహం తిప్పుకుంది. "అలాటి భయమేమీ లేదు. ఎవరూ రారు."

"అక్కా—?"

రాధ నిట్టూర్పు విడిచింది. "అవునమ్మా—రారు."

రజియా మాట్లాడలేకపోయింది.

"నాది మానిన గాయం; నీది ఇప్పుడే తగిలిన పచ్చిగాయం. అంతే తేడా. మనిద్దరం ఒక్కలాగే వంచించబడ్డాం."

"అందుకా, నాబాధ పంచుకున్నావు!" అనుకుంది రజియా. కాని, రాధమెడలో మాంగల్యం ఉంది. అది పవిత్రమైన వివాహచిహ్నం. వివాహితలు ఎలా మోసపోతారో రజియాకి తెలియలేదు. హిందూ దంపతులు కట్టుబడతారనే, ఆమె నమ్మకం.

"నీ కథ నేను తెలుసుకోకూడదా అక్కా?"

రాధ మాట్లాడలేదు.

"నీ బాధ నేను పంచుకోకూడదా అక్కా?"

"—నీ మనసు దానికి తట్టుకోలేదు చెల్లీ—చెప్పడం అంతకష్టమూకాదు; చెప్పకూడనిది అందులో ఏదీ లేదుకూడాను.

"కాని—మీవారు బ్రతికే ఉన్నారుగా" మాంగల్యం వేపు చూస్తూ అంది రజియా.

"అవును చెల్లీ — నా కెప్పటికైనా నన్ను స్వీకరిస్తారనే వారి చిహ్నాలన్నీ ధరించి ఉన్నాను—"

ఇద్దరు బిడ్డలూ, ఒక జత మాంగల్యాలూ—ఇవా, వారి చిహ్నాలంటే?

రాధ చెప్పసాగింది.

"—మా పెద్దలందరూ నేను అనుకున్నవిధంగానే — నేను కోరిన వరుణ్ణే నాకు వరుడిగా నిర్ణయించేరనగానే ఎంతో ఉబ్బిపోయాను. వారి రూపం, గుణం, చదువూ అన్నీ అందరికీ నచ్చడం నా అదృష్టమేఅని ఆనందించాను. వారికి మేనరికం ఉండడం వల్ల కొన్నాళ్లు నిరుత్సాహపడ్డం జరిగింది. కాని మేనరికం వారికి ఇష్టంలేదనీ, వారూ నన్నే కోరారని తెలిశాక మావాళ్లు ప్రయత్నాలు చేశారు. పెద్ద చదువులకి అమెరికావెళ్ళి రెండేళ్లు ఉండి వస్తాడు మా అబ్బాయి, అని వాళ్లనాన్నగారు చెప్పగానే ఆ మేనరికంవాళ్లు వాళ్లపిల్లకి వేరే సంబంధం చూసుకోడంతో నాకు ఉన్న ఒక్క ఆటంకమూ తొలగిపోయినట్లైంది.

'—ఇప్పు డనుకుంటే చిత్రంగా ఉంటుంది—నే నెప్పుడూ వారికోసం వేచి ఉంటున్నాను; నాటి మంచి నేటివరకూనూ. అమెరికావెళ్ళి ఇంకా పెద్ద

# ఏఱుదాటని మావ మనసు

వి. వి. సుబ్బారావు

ఏఱు దాటొత్తాన ఓలమ్మో—నిన్ను
ఎగరేసి కెల్తాన నా రాణీ!
సుక్కల్లా సినవోడు—నిక్కుసూత్తుం టేని
నెక్కంగ నావ నీ—పక్క కొత్తాదంట...
సెలపేటి నడుమనే—సుడిగుండ ముందంట
మన ప్రేమ జడిలోన—సుడిగిడి విడిపోవు!...
సివురు టాకులమీద—కోయిలే సిత్రంగ
కోయంటు సైగగా—గొంతెత్తి పిలువంగ...
నా-మీది నీ మనసు—పగ్గమై లాగంగ
బరబరా నా నావ—పరుగులెత్తుతుండంగ...
ఏటికద్దరి నీవు—ఏకూరుతుండంగ
ఎనక నే జడపట్టి—ఎకనక్కి మూడంగ...
ఏఱు దాటొత్తాన ఓలమ్మో!
ఎగరేసి కెల్తాన నా రాణీ!

# ఇద్దరు అబలలు

చదువు చదువుకుని వస్తారని వారికోసం వేచి ఉన్నాను; ఆ రెండేళ్ళూ. రెండేళ్ల అనంతరం వారు నా నోములు పండించడానికి, నా జీవితంలో వెన్నెల చూపించడానికి వచ్చేరు. మా కిద్దరికీ వివాహమై పోయింది. అప్పుడప్పుడు నా కనిపించేది—ఈ రెండేళ్ళలోనూ రూపంలో పెద్ద తేడా లేకపోయినా, అంతస్సులో వారి కేదో కాఠిన్యం పెరిగినట్లు. కాని, ఏళ్లపైబడి, జ్ఞానం వృద్ధిచెంది, ప్రాపంచిక చింత ఎక్కువయితే కాఠిన్యం ఎలాగూ తప్పదని సరిపెట్టుకున్నాను.

"—కొన్నాళ్ళకి తెలుసుకున్నాను—నిజరూపం. వారు విదేశాల్లో ఆర్జించిన జ్ఞానంకన్నా అజ్ఞానమే ఎక్కువని. క్లబ్బుల్లో జూదాలూ, ఖరీదైన త్రాగుడూ అలవాటయ్యాయి వారికి. సంపాదన ఎక్కువై, సంఘంలో స్థానం పెద్దదవడాన్ని, ఈ దురవాట్లన్నీ సభ్యతగా చెలామణీ అయ్యేవి. నా మనస్సుమాత్రం కుమిలిపోతూ ఉండేది.

"—ఇంట్లో కూడా నా స్థానం నానాటికి దిగజారజొచ్చింది. వారి స్నేహితులందరికీ — మగా, ఆడా చాలామంది ఉండేవారు—వాళ్లకి టిఫిన్లూ, కాఫీలూ, డిన్నర్లూ అమిర్చిపెట్టడమే నాపనైపోయింది. నే నందుకోసమే నన్నట్లు ప్రవర్తించే వా రాయనా, ఆయన స్నేహితులూ కూడానూ. చిరునవ్వుతో నేను వారికి ఎదురువెళితే చీదరింపుతో ఛీత్కారంతో నన్నాయన సత్కరించేవారు.

"అయిదేళ్లు గడిచేలోగా ఇంట్లో ఈ ఇద్దరు బిడ్డలూ వెలిశారు; భరించరాని ఖర్చుల ఫలితంగా విలువైన సరుకంతా పీఠం ఎత్తుకొని వెళ్ళిపోయింది. ఇల్లు కేళీమందిరం అయి, క్రమంగా నరకమై పోయింది.

"నాకు మరీ బాధ అనిపించిం దేమిటంటే ఆయనకి— ఆయన సంతానంపైనికూడా కాస్త మమత లేకుండా పోయింది. నేనూ, నా పిల్లలూ ఒకనాడు వారి కళ్ళకు వెన్నెల వెలుగులూ, రత్నాలూ, ముత్యాలూ, దీపాలూ అయితే, ఆనాడు వారి మార్గాని కడ్డుపడే ముళ్లకంచెల్లా అయ్యాం. అయినా, ఆడదానికి మొగుణ్ణంటిపెట్టుకొమంటే అదొక ఆత్మబలం. ఆ బలం కోసం, లోకులదృష్టిలో హీనపడకుండా ఉండేందుకు, ఆయన్నే నమ్ముకొని మంచిరోజులకోసం, ఆయనలో మార్పుకోసం ఎదురు చూసేను — డబ్బు తెమ్మనేవారు, మా నాన్న నడిగి. లేకపోతే నానా మ్మాట్లనేవారు. ఆత్మాభిమానం చంపుకుని మా నాన్న నడిగి చాలాసార్లు తెచ్చాను.

"—ఒకనాడు ఎలాగో వారిమాట కెదురాడాను. తెస్తే విలాసాలకి ఖర్చు చేస్తున్నారుగదా, లేకపోతే నే ఏమైనా దార్లోకి వస్తారనిపించి మొండికేసి మొరాయించాను. ఆరోజు ఆయన నాలుగు ఉపాయాలూ ప్రయత్నించారు. ఆఖరికి "నువ్వుచస్తే శని విరగడవుతుం" దంటూ స్పృహ తప్పేవరకూ కొట్టారు.

"మళ్లీ లేచేసరికి నిశిరాత్రయింది. పనిమనిషి ప్రక్కన కూర్చుంది. పిల్లలు బెంగపెట్టుకున్నారు లెమ్మంటోంది. నా కేమీ ఓదార్పు కలగలేదు. ఆయన ఎప్పుడైతే కొట్టడందాకా వచ్చారో నా కా ఇంట్లోనేగాక, ప్రపంచంలోనే స్థానంలేదని నిశ్చ

యించుకున్నాను—ఎవరూ చూడకుండా నదిలోకి పారిపోయాను. గట్టుతీసి పారుతోంది గోదావరి. ఆ గలగల చప్పుడులో ఎంతో విశ్రాంతి కనబడి ఇక్కడికి రారాదా అని ఎవరో ఆహ్వానించినట్లైంది. క్షణమాత్రం పాలబుగ్గల పసిడిపాపలా—నవమాసాలూ మోసిన అమ్మాయి గుర్తొచ్చారు. కాని మరుక్షణమే అంతులేని అవమానాలతో అంతంలేని జీవితం నన్ను భయపెట్టింది. ముందుకి ఉరికాను

"వెనుకనుంచి ఎవరిదో బలమైన చెయ్యి—నా భుజం పట్టుకుని ఆపేసింది. నిర్ఘాంతపోయాను. భయంతో, అవమానంతో నా తల వాలిపోయింది." "ఎంత సాహసం తలపెట్టావు రాధా—" అని ఎవరో నన్ను మందలించారు — గొంతుక విని గుర్తుపట్టాను—ఆయన మా పక్కింటి వాసుదేవరావుగారు. పిల్లల్లేరని నన్ను బిడ్డలా చూసుకొని చాలాకాలం నన్ను వాళ్లింట్లోనే ఉంచుకొన్న బాబాయిగారు. "ఇంకెప్పుడూ ఇలాటి ఘోరం తలపెట్టనని ఈ బాబాయిమీద ఒట్టెయ్యమ్మా—" అంటూ నన్ను ఇంటికి తీసుకొచ్చారు.

"ఇంటికి రాగానే ఆయన నన్ను పలకరించారు. పక్కనే ఒకామె ఎవరో వాఙ్మౌనంగా ముసుగు వేసుకొని ఉంది. "చావాలనుకున్నావే, చావక మళ్ళీ బ్రతుకుదేనికి?"—

"నీ బాధ్యత ఎరిగి ప్రవర్తించవమ్మా. పసికందుల్ని ఈ పరిస్థితుల్లో అన్యాయంచేసిపోవడంకన్నా పాపం ఉండదు" అని చెప్పారు బాబాయిగారు.

"మీ వైఫ్?" అని మావారి ప్రక్కనున్నామె అడిగింది.

"అవును. ఒట్టి సెన్సులెస్ ఫూల్. పశువునయం. ఇంతకంటే" అన్నారాయన. ఇద్దరూ పగలబడి నవ్వుకుంటూ మేడమీదికి వెళ్ళిపోయారు. మెట్ల దగ్గిర నిద్రలేనిరాత్రి గడిపాను. ఎంతచేసి అవమానాలూ సహించడానికే, ఈదేశంలో ఆడవాళ్ళు పుట్టడం. భూదేవంతటిది కడుపులో గడ్డపార వేస్తే నాలుగుపోట్లు పొడవంగానే రాయితగిలి ఇహ నే భరించలేనని మొండిమొహం పెడుతుంది. ఆడది మాత్రం అంతులేని అవమానాలు కడలేని కష్టాలూ భరించవలసిందే.

"తెల్లవారుతూ ఉండగా వారిద్దరూ సామాన్లతో మేడదిగారు. "బొంబాయివెళ్ళి ఇంకో ఉద్యోగం చూసుకొని వస్తా" నన్నారాయన. బొంబాయిలో ఈయన వెళ్ళి చేసే ఉద్యోగమేమిటో తెలుస్తూనే ఉంది.

"అదే ఆఖరు దర్శనం చెల్లీ"

"అనాటినించి అక్కడ ఉండలేక, నాన్నగారి దగ్గిరికొచ్చి ఆయన సలహాతో పిల్లల్నిద్దర్నీ వారి దగ్గిరుంచి నర్సు ట్రెయినింగుపొంది, ఈ ఊళ్లో ఈ హాస్పిటల్లో ఉద్యోగానికొచ్చేను—ఈ ఇద్దరు పిల్లల్నీ, ఆ దిక్కులేని రోగుల్నీ పోషించుకుంటూ, ఆయన కబురుకోసం, ఆయనకోసం ఇలా ఎదురు చూస్తున్నానమ్మా—"

చీరతో కన్నీళ్ళు ఒత్తుకుంది రాధ.

"ఎంత విషాదజీవితం అక్కా నీది!—నేనే అనుకున్నాను!" అంది రజియా.

"నీకు నేను చాలా కృతజ్ఞురాల్ని చెల్లీ. నీమూలంగా నేను ఆధ్యాత్మికంగానూ, ఐహికంగానూకూడా తరించాను" అంది రాధ. రజియా రెండుచేతులూ పట్టుకొని మృదువుగా నొక్కుతూ.

"నామూలంగానా?—ఏమిటక్కా నువ్వంటున్నది?"

"అవునమ్మా నీ మూలంగానే. నువ్వు నా కళ్ళు తెరిచావు. అనుభవం నాకేమీ పాఠం నేర్పక, ప్రతిదీ రూపాయణా పైసల్లో లెక్క కట్టుకుంటూ ప్రాపంచికమైన చింతతో బ్రతికాను. ఉద్యోగం చేస్తున్నాను, జీతం తీసుకుంటున్నాను అన్న భావంతప్ప—కష్టంలోవున్నవాళ్ళకి సేవచేస్తున్నాను; వారి సంతోషం భగవంతుణ్ణి సంతోషపెట్టగా నేను సంతోషంగా కాలం గడుపుతున్నాననేభావం నాకు కలిగేది కాదు. మా ఛీఫ్ సర్జన్ మమ్మల్నందర్నీ భగవంతుని సేవకులారా, అని పిలుస్తాడు. మానవసేవే మాధవసేవ అని ఆయన నమ్మకం. పతితులసేవే పరమాత్ముని సేవ అని ఆయన సిద్ధాంతం. అది అంతా ఒట్టి గాలి అనీ, పనికిరాని వేదాంతమనీ దురభిప్రాయపడేదాన్ని.

"మొదటిసారిగా నిన్ను చూసి చలించానమ్మా చెల్లీ. నువ్వు ఆస్పత్రి కాంపౌండ్ గోడదగ్గిర పడిఉంటే మనసారా నిన్ను రక్షించాలన్న కోరికతో నిన్ను హాస్పిటల్లో జాయిన్ చేశాను. కాన్పుచేసినా, ఆపరేషన్ చేసినా, నీ బిడ్డకి ప్రాణం [illegible] కాదా, [illegible] కున్నా—[illegible] [illegible] [illegible], [illegible] [illegible] చేర్చుకోవాలనుకొన్నా, చూసుకొన్నాను. నిన్ను నిర్లక్ష్యం చేద్దామని ఎంత గట్టిగా నిశ్చయించుకున్నానో అంతగా నిన్ను ప్రేమించడం మొదలు [illegible], డిస్చార్జి చేసి [illegible] [illegible] కొట్టుకుంటున్న [illegible] [illegible] అక్కున్చేర్చి [illegible] [illegible] కొచ్చాను..... [illegible], నా కన్నా కూడా ప్రేమించడం నేర్చుకున్నాను.

"ఎవరో నా బ్రతుకు అనాథలకి అంకితం చెయ్యమన్నట్లు, నేను నాడిగ్గేర్లనుంచి అనాథలయి [illegible] పోగొట్టుకుంటున్న నా ఉద్యోగం, [illegible] నా కన్నపిల్లలు అక్కడున్న [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible], [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. [illegible], [illegible] [illegible] [illegible]—[illegible] [illegible], [illegible] నా [illegible] [illegible] [illegible] [illegible]"

రజియా కన్నీళ్ళు తుడుచుకొంది. 'నిజమా'? [illegible] [illegible].

"నీమూలంగా నేను ప్రేమించడం అనే ఒక [illegible] [illegible]. [illegible] [illegible] [illegible]—ఈ [illegible] నా [illegible], [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. [illegible] [illegible], [illegible] [illegible]. [illegible] [illegible] [illegible]—[illegible]. [illegible] [illegible] [illegible] [illegible] [illegible], [illegible] [illegible] [illegible] [illegible], [illegible] [illegible] [illegible]—[illegible] [illegible]—"

రజియా మాట్లాడలేకపోయింది. "నిజమా అక్కా! మీరెంత మంచివారు!" అంది.

"అక్కని మీరూ— అనకూడదు" అంది రాధ మనసారా నవ్వుతూ.

★

# మన మానవదేహస్థితి

31-వ పేజీ తరువాయి

శరీరంలోవున్న అసంఖ్యాక జీవకణములన్నీ, శుక్లశోణిత కణముల విలీనంవల్ల ఏర్పడ్డ పిండకణము విభజనపొంది ఏర్పడ్డవే. ఆ ఒక్కకణము, అసంఖ్యాకవిభజనలు పొంది కొత్తకణములన్నీ వేరువేరు ఆకృతులూ, రసాయనిక స్వభావమూ పొంది, అనేక టిష్యూలుగా, టిష్యూలతో ఏర్పడిన అంగములుగా, అంగనిర్మితములయిన కోశములుగా ఏర్పడిపోతవి.

పిండశరీరం సైజూ, బరువూ, అందులో ఉన్న అంగముల ఆకృతి, సైజూ, బరువూ నిర్ణయించేశక్తి యేది? పిండశరీరమూ పిండశరీరాంతర్గతము అయిన అంగములూ ఒకస్థితికి పెదగగానే, వాటివృద్ధిని ఆపుజేసే పరిస్థితులు ఏవి? అన్నప్రశ్నలు శాస్త్రజ్ఞులను కలవరపరచినవి.

పిండవృద్ధిని నిర్ణయించే కారణాలలో అతి ముఖ్యమైనవి జెనీలు, వాటికి మరికొన్ని ఇతర పరిస్థితులు సహాకరిస్తవి.

శుక్లశోణిత సంయోగంతో యేర్పడిన అండములో Spermatozoon మాతృపితృకణముల నుండి అన్నిరకముల జెనీలు వచ్చివుండాలనే నిర్ణీతం లేదు. పిండవృద్ధి, పిండకాలంలో ఏర్పడే అంగలోపములూ, అంగవైకల్యములూ, పిండకణంలో లోపించిన జెనీలనుబట్టి ఏర్పడతవి. పారంపర్యంగా సంభవించే వ్యాధివిశేషములు వ్యక్తుల జెనీలలో మార్పులు కలిగిస్తవని భావించడానికి అవకాశం ఉన్నది. లోపించిన జెనీలతోపాటు, రోగకారకములయిన జెనీలుకూడా, వ్యక్తికి సంక్రమిస్తవి. క్రోమోజోము అలచందకాయలాగా పొడుగా ఉంటుంది. అందులో జెనీలు అలచంద విత్తులలాగా నిలువుక్రమంలో ఉంటవని శాస్త్రజ్ఞులు కనుక్కొన్నారు. శిరస్సునుంచి పాదంవాకా ఏర్పడిఉన్న అవయవములన్నింటికీ మూలములయిన జెనీలు, క్రోమోజోములలో వరసగా ఉంటవేమో తెలియదు. అయితే అప్పుడు 24 జతలెందుకు? శరీరశాస్త్రం ప్రకారం, వెన్నుపాములో Spinal Cord ) ఏడుభాగములున్నవి. ఈ ఏడుభాగములూ ఏడు శరీరభాగములతో సంబంధించి ఉంటవి. వీటిని సప్తప్రహారీలు అంటారు. క్రోమోజోములో జెనీలూ ఈ విభాగం కలిగే ఉంటవేమో చెప్పలేము. పిండవిభాగంగానీ, కుమారకణములలో

వివి ఏ అవయవములు కావాలన్న విషయమును గాని నిర్ణయించే కారణములను గురించి శాస్త్రజ్ఞులలో అనేకాభిప్రాయము లున్నవి.

క్రోమోజోములలోవున్న జెనీలసంఖ్య సరిసంఖ్య అయినా "మైటోసిస్" అనే జీవకణ విభజన విధానంలో, అవి రెండు కుమారకణములకూ సమానంగానే పంచబడినా, సైటోప్లాజముకూడా సమానంగానే పంచబడదు. సైటోప్లాజములో అనేకరకముల న్యూక్లియోప్రోటీనులు అనేక ఎంజయిములు వున్నవి. విభజనలో వీటిపరిమాణములలో ఏర్పడే భేదమువల్ల, కుమారకణములలో భేదములు ఏర్పడుతవి. ఆ కుమారకణములు మళ్లీ విభాగం పొందినప్పుడు, ఆ భేదం కొత్త కుమారకణములలోకీ వ్యాపిస్తుంది. విభజన అధికం అయినకొద్దీ, ఆ భేదమూ అధికమౌతూ ఉంటుంది. ఇల్లా భేదరూపలక్షణములుగల జీవకణసముదాయము వివిధావయవములుగా ప్రవృద్ధిచెందడానికి, అవకాశముందని కొందరి భావన.

మూలజీవకణంలో ఎన్ని జెనీలున్నవో నిర్ణయించబడకపోయినా కనీసం 25000 అయినా ఉండివుంటవని శాస్త్రజ్ఞుల అంచనా. జీవకణం విభాగం పొందడానికి ముందే జెనీలు కావలసిన సంఖ్యలో ఏర్పడివుంటవి. ఇంతవరకూ తెలియని కారణంచేత, జీవకణ విభాగంనాటికి కొన్నిజెనీలు ఏర్పడకుండావుండి, ఆస్థితిలో జీవకణం విభాగం పొందినప్పుడు మాతృకణానికీ కుమారకణానికీ మధ్య జెనీల సంఖ్యలో భేదం ఏర్పడుతుంది. సైటోప్లాజములో ఉండే న్యూక్లియోప్రోటీనుల స్వభావం పరిమాణములను నిర్ణయించేవి జెనీలు. ఆ జెనీల సంఖ్యలో మార్పు రాగానే ఆజెనీలకు సంబంధించిన న్యూక్లియోప్రోటీను ఉత్పత్తిలోనూ మార్పులు ఏర్పడుతవి. జీవశక్తి ధారణకు న్యూక్లియోప్రోటీను అవసరం. అందులో భేదం ఏర్పడగానే వాటినుంచి ప్రవృద్ధిచెందిన అంగముల, రూపూ, ధర్మమూ, మారిపోవచ్చును. ఇంతేకాదు. ఎంతవేగంతో మారిపోయిన జీవకణముల విభజన యేర్పడుతుందో, ఆవేగంమీద కూడా వాటినుండి ఏర్పడిన అంగముపరిమా

# మనమూ-మనదేహస్థితి

ణమూ ఆధారపడి ఉంటుంది. లివరు పెద్ద అవయవము. మెదడుక్రిందఉండే పిట్యూయిటరీ గ్రంధి చాలా చిన్న ఉపాంగము. లివరులో జీవకణములు విభజనపొందినంత వేగంగా పిట్యూయిటరీలో జీవకణములు విభజనపొందవు.

శిశువృద్ధి ఒకదశకు వచ్చినతరువాత కొన్ని దేహపరిస్థితులు అంగవృద్ధికి దోహదంచేస్తవి. కండరముల అంతములు బొమికలకు అతుక్కుని ఉంటవి. బొమికలు పొడుగైనకొద్దీ వాటిని అంటివున్న కండరములూ పొడుగౌతూవస్తవి. కండలు పెరిగినకొద్దీ వాటిని కమ్మివుండే చర్మమూ విస్తరిస్తూ ఉంటుంది. అల్లా పిండములో వివిధాంగముల మూలకణములనుండి వివిధభాగములు ఏర్పడతవి. వయస్సుల్లోకూడా ప్రమాదాలవల్ల నశించిన జీవకణములను తాత్కాలికంగా అధికవిభజనపొంది, ఆలోచన భర్తీచేస్తవి. ఒక్కొక్క అంగవృద్ధికి ఒక్కొక్కరకమయిన ఆహారపదార్థం కావాలి. అదేవిధంగా ఆయా ఆహారపదార్థములు రక్తంద్వారా ఆ ప్రదేశాలకు అధికంగా పోతవి. ఇక్కడా మళ్లీ ప్రాణశక్తి విచక్షణ ప్రదర్శితమౌతున్నది.

కేన్సరు: జీవకణంలో ఉండే జెనీలు మార్పుచెందినప్పుడు కొత్తరకముల జీవాణువులు ఉత్పత్తి అవుతవని తెలుసుకున్నాము. ఈ మార్పు, జీవకణాభివృద్ధికి దోహదంచేసేదీ కావచ్చు ఆటంకం కలిగించేదీ కావచ్చు. కాని అపరిమితాభివృద్ధికరమైన జీవకణపరివర్తన ఎప్పుడోగాని జరుగదు. అయినా అతిసకృతుగా కొన్ని జీవకణములకు అపరిమిత విభజనశక్తి సంక్రమిస్తుంది. అటువంటి జీవకణమువిభజన ఒక అంగము కావలసిన సైజునూ రూపునూ పొందగానే ఆగిపోదు. అనంతంగా విభజన సాగుతూనే ఉంటుంది. అప్పుడు అటువంటి జీవకణమువున్న ప్రదేశములలో కణుతులు (Tumous) ఏర్పడుతవి. ఇటువంటి కణితిలోవుండే కొత్తజాతి జీవకణములకు, ప్రక్కనే ఉన్న అంగములలోకి వ్యాపించేగుణమూ, తల్లి కణితిని విడి, రక్తప్రవాహంలో పడి, శరీరంలో ఇతరప్రదేశములకు పోయి, అక్కడ విపరీతాభివృద్ధి పొంది కొత్తకణుతులను ఏర్పరచే గుణమూవుంటే ఆ జీవకణములను దుష్టజీవకణములు (Malignants) అంటారు. అటువంటి "దుష్టజీవకణములు" శరీరభాగములో ఏభాగానికైనా చెందినవై ఉండవచ్చును. కండరములనుంచి వచ్చిన దుష్టకణములు సార్కోమా అనే కండరముల కణితిని ఏర్పరుస్తవి. మ్యూకస్ పొరమీది ఎపితిలియంనుంచి వచ్చిన దుష్టకణములు ఎపితిలియోమా అనే దుష్టగ్రంధిని ఏర్పరుస్తవి. దీనినే 'కేన్సరు' అనికూడా అంటారు. ఇల్లా ఒక్కొక్క ధాతువునుంచి వచ్చిన దుష్టకణములు ఒక్కొక్కధాతువులో అభివృద్ధిచెంది దుష్టగ్రంధులను కలిగిస్తవి.

ఒక్కొక్కప్పుడు బహుకాలం విడవకుండా ఏర్పడిన ఇరిటేషన్‌వల్ల జీవకణాలలో దుష్టస్వభావము ఏర్పడవచ్చును. అణువిచ్ఛిత్తి కాలంలో ఏర్పడే "గామా" కిరణములు, జెనీలలో కొత్తజాతులను సృష్టించి, కేన్సరును కలిగించవచ్చును. అల్లాగే, నోటిలో పొగాకు పెట్టుకుని ఉండేవారు భావికి గుండెంమీద కుంపట్లు పెట్టుకుండేవారు. కొన్ని దీర్ఘములయిన క్రిమిదోషానికి గురి అయిన గోప్యాంగములుగల స్త్రీలు కేన్సరుకు బలి ఆయ్యే అవకాశంవున్నది. శరీరంలోఉండే కొన్ని గ్రంధులస్యందనములు ఈ అతివృద్ధిని ఆపగలశక్తి కలిగివుంటవి. స్త్రీల స్తనములలో ఏర్పడిన కేన్సరువృద్ధిని రజఃకోశములనుండివచ్చే సెక్సు హార్మోనులు కొంత వరకు అరికట్టగలవు. అదేవిధంగా పురుషులలో ప్రోస్టేటు గ్రంధిలోనూ ఇతర అంగములలోనూ ఏర్పడే కేన్సరు, బీర్జములలో తయారయ్యే హార్మోను పుష్కలంగా ఉంటే, చాలా నెమ్మదిగా వృద్ధిచెందుతుంది. అందువల్లనే కేన్సరు ఏర్పడివున్నవారిలో ఈ గ్రంధులను తీసివేయరాదు. తీసివేసినవారిలో కేన్సరు ఏర్పడితే అతిశీఘ్రంగా వృద్ధిచెందడం అనుభవంలో కనుపిస్తున్నది. కాని చాలా కేన్సర్లు అకారణంగానే ఏర్పడి అతిశీఘ్రంగా పెరిగి, ఇతర అవయవములకు వ్యాపిస్తవి.

విపరీత పరిస్థితులలోతప్ప శరీరంలో జీవకణవులన్నీ తమవృద్ధిని ఒక అదుపులోనే వుంచుకుంటవి. ఇందుకు కారణమేమిటో ఇంకా తేలలేదు. కేన్సరు సమస్య అర్థంకావాలంటే జీవకణంలో జెనీలను గురించిన సంపూర్ణపరిజ్ఞానం ఏర్పడాలి. అంటే ప్రాణశక్తిస్వరూపమే అర్థంకావాలి. కాని, అణువిజ్ఞాన ఫలితంగా యేర్పడిన కిరణచికిత్సలు, కేన్సరు నివారణకు చాలా సహకరిస్తున్నవి. వాటిని సందర్భం వచ్చినప్పుడు వివరిస్తాను. ★

## జీవకణ విభజన-దశలు



# హాయవాతా అద్భుతగాథ

25-వ పేజీ తరువాయి

పాముగరిడీలను గురించి పడమటిగాలి ఎన్నెన్నో ప్రశ్నలడిగాడు. వాటికన్నిటికి సరిఅయినసమాధానా లిస్తూనేఉన్నా, హాయవాతా గుండెల్లో అణిగి మణిగిఉన్నకోపం కుంపటి రాజుకుంటూనే ఉంది. ఎంత సేపటికి పడమటిగాలి పెనోనామాట తలపెట్టలేదు. క్రమక్రమంగా అతడు మళ్లీ తన సొంతగోడవ మొదలు పెట్టాడు. హాయవాతా కాపైన ప్రాణం విసిగింది. అట్టుడికినట్టు ఉడికినా పైపైకి అది ఏమీ బయట పెట్టలేదు. ఆతరవాత పడమటిగాలి అంటీఅంటనట్టు పెనోనామాట ఎత్తి 'పాపం మీఅమ్మ ,చిన్నతనంలోనే స్వర్గానికి వెళ్ళిపోయింది! ఆ దైవాన్ని అడ్డుకోగలవా రెవరయినా ఉన్నారా!' అని నిట్టూర్చాడు.

ఆమాట వినీవినగానే హాయవాతా హఠాత్తుగా లేచి నిలబడి కళ్లెర్రజేసి 'ఇందులో ఆ దైవం తప్పు ఏమి ఉంది? అంతా చేజేతులా నువ్వే చేశావు!' అన్నాడు.

అయినా పడమటిగాలి మాట్లాడలేదు. ఏమీ ఎరగనట్టు అలాగే ఊరుకున్నాడు. అంతలోనే హాయవాతా మళ్లీ అందుకున్నాడు:

"ఏ మాటనవేం? నువ్వే చేజేతులా మా అమ్మని చంపివేశావు! కలవపువ్వు కాలితో మట్టివేసినట్టు ఆమె అందం, చందం, వైభవం అన్నీ పొట్టబెట్టుకున్నావు! కాని ఏమీ ఎరగని నంగనాచిలా కూర్చున్నావా? ఏం మాట్లాడవేం! చేసిన పాపానికి నిన్ను నిలువునా చీల్చివేసినా పాపం లేదు!"

పట్టరానికోపంతో హాయవాతా ఒళ్ళు గజగజ వణికింది. అయినా పడమటిగాలి మాట్లాడలేదు. తప్పు తనదే అన్నట్టు కొంచెం తలవంచుకున్నాడు. అంతే! మళ్ళీ హాయవాతా గట్టిగా గద్దించాడు:

"ఏం మాట్లాడవేం ? చేసినతప్పు ఒప్పుకోడానికి ఇంత బెట్టెందుకు ? ఇప్పటికయినా పశ్చాత్తాపపడితే నీ ప్రాణం నిలుస్తుంది. లేకపోతే ఈనాటితో నీ కాయుర్దాయం మూడినట్టే!...ఏం మాట్లాడవేం!'

అయినా పడమటిగాలి కిమ్మన లేదు. అలాగే తలవంచుకుని కూర్చున్నాడు. హాయవాతా మరి ఉండబట్టలేక మహోగ్రుడై రెండుఅంగల్లో తండ్రి చెప్పిన ఆ కొండం శిఖరం దగ్గిరికి వెళ్ళిపోయాడు! అప్పటికి పడమటిగాలి బాగా పశ్చాత్తాపపడ్డాడు. తానుచేసినది తప్పే అని ఒప్పుకోవాలని అనుకున్నాడు. కాని ఏమి లాభం! ఆ కొండశిఖరం అక్కడికి ఒకేఒక క్రోసుదూరంలో ఉంది. గట్టిగా కేకలుపెట్టినా వినబడదు! అందుచేత వద్దువద్దన్నట్టు రెండుచేతులు బాగా పైకెత్తి నిలబడ్డాడు. అంతలోనే హాయవాతా తన పిడికిలి పోట్లతో ఆ కొండశిఖరం అంతా పెద్ద పెద్ద బండరాళ్ళుగా నలగగొట్టి వేశాడు. బాగా గురిచూచి ఒకొక్క బండరాయే విసరడం మొదలుపెట్టాడు. దానితో పడమటిగాలి నవనాడులూ కుంగిపోయాయి.ఆనాటితో తన కిక చావు తప్పదేమోనని భయపడ్డాడు. అంతలోనే తిరిగి ధైర్యం తెచ్చుకుని వాయువేగంతో ఆ పొడుగాటి చెట్టు దగ్గరికి వెళ్లి వేళ్లతోసహా దాన్ని పెళ్లగించి పైకెత్తి పట్టుకొని దాని మాటున దాక్కున్నాడు.

హాయవాతాఅలాగే శరపరంపరగా రాళ్లవర్షం కురిపిస్తున్నాడు. పడమటిగాలి మాటిమాటికి ఆ చెట్టు చాటున దాక్కుని ఎంతో మెళుకువగా దెబ్బ

## మా పాప

ఎ. వి. రమణ, జి. వి. రావు

"మా పాప మా యింటి రేవెలుగు రేక
మా పాప మా మదికి తేనియలవాక,
మా చిట్టి పాపాయి అందచందాలు
గోపాలకృష్ణమ్మ తోటి పందాలు,

మా పాప బోసి నవ్వుల పలకరింపు
శారద జ్యోత్స్నలో సుధ గిలకరింపు
మా చిట్టి పాపాయి చిన్నారి నడలు
మానస మరాళాల గుండియల హాడలు,

మా చిట్టి పాపాయి 'తత్తత్త' పలుకు
కులికేటి చిలకలకు ఎంతయో ఉలుకు,
చిన్నారిపొన్నారి మా పాప కాక
ఇంకెవరు భావిభారత జయపతాక?"

## హాయవాతా
## అద్భుతగాథ

తప్పించుకొంటున్నాడు. ఆ మహా భయంకరమయిన ద్వంద్వయుద్ధం చూచి ఆకాశంలో ఎగురుతున్న రాంబందులు ఎక్కడివక్కడే చెట్ల మీద వాలిపోయాయి. మెడలు రిక్కించి వాళ్ళయుద్ధ చాతుర్యం పరిశీలించాయి. సింహాలు, పెద్ద పులులు, ఏనుగులు మొదలయిన ఘాతుకజంతువులు తమతమ శత్రుత్వాలమాట మరిచిపోయి గుంపులు గుంపులుగా పరుగులుపెట్టి కొండ గుహల్లో దాక్కున్నాయి. క్రమక్రమంగా పడమటిగాలి చేపట్టిన చెట్టు హాయవాతా బండరాళ్ల వర్షంతో తుత్తునియలయింది. పడమటిగాలికి తలదాచుకోడానికెక్కడ ఆస్కారం కనబడలేదు. మరి లాభం లేదని గిరుక్కున వెనక్కితిరిగి అడవిలోపడి అదేపనిగా పరుగు మొదలు పెట్టాడు. అప్పటికి హాయవాతా చేతిలోఉన్న రాళ్ళన్ని చాలాభాగం అయిపోయాయి. ఏ ఒక్క రాతి దెబ్బ తగిలినా పడమటిగాలి నేల మీద కూలిపోవలసిందే! ఆ చెట్టుతో ఒక్కదెబ్బ కొడితే హాయవాతా హతమారిపోవలసిందే! కాని పడమటి గాలికి ఆ రాళ్ళవర్షంలోనించి తప్పించుకొని బయటపడడమే గగనమయి పోయింది. చూస్తూండగానే ఆ చెట్టు చిన్నచిన్నముక్కలై క్రమక్రమంగా గాలిలో కలిసిపోయింది.

అప్పటికి హాయవాతా చేతిలో ఒకే ఒకరాయి మిగిలింది. అతడది జాగ్రత్తగా గురిచూసి తనకున్న శక్తిఅంతా వినియోగించి తండ్రిమీదికి విసిరివేశాడు. కాని పడమటిగాలి ఎంతో ఒడుపుగా

తప్పించుకున్నాడు. అయినా హాయవాతా తన పట్టుదల విడిచిపెట్టలేదు. వేరొక పర్వతశిఖరం బద్దలుకొట్టి ఇంకొక పెద్దబండరాయి విసిరివేయబోయాడు. అంతలోనే బాగా అలిసిపోయి నేలమీద చదికిలబడిన పడమటిగాలి అతనికేసి తిరిగి బ్రతిమాలుకున్నాడు:

'నాయనా! హాయవాతా! నావల్ల పెద్ద అపరాధమే జరిగిపోయింది! నిజంగా నామూలానే మీ అమ్మ చనిపోయింది! నన్ను మన్నించు! కన్న తండ్రిని చంపివేస్తే నీకు ఒరిగేదేమి ఉంది! అదీగాక నాకింక చావులేదు! నీ చేతిలో ఉన్న అనల్లకొండ శిఖరం బండరాళ్లన్నీ అయిపోయాయిగా! ఇంకొక కొండ శిఖరం బండరాళ్లతో చావమోదినా నా ఒళ్లు హూనం అయితే కావచ్చును గాని ప్రాణాలుమాత్రం పోవు! తేలికగా చంపగలిగినా మొట్టమొదట నిన్నా చెట్టుతో చావగొట్టకుండా విడిచిపెట్టలేదా?'

ఆ విధంగా ప్రాధేయపడిన తరవాత పడమటిగాలి మరి మాట్లాడలేక కుప్పగా కూలిపోయాడు. అప్పటికి హాయవాతా కోపం బాగా చల్లారింది. చేతిలో ఉన్న బండరాయి దూరదూరంగా విసిరివేసి తండ్రి దగ్గిరికి వెళ్లి నాడి పరీక్షించాడు. అది ఇంకా కొట్టుకుంటూనే ఉంది. హాయవాతా అతని కెన్నో విధాల శీతలోపచారాలు చేశాడు. మరి కొంతసేపటికి పడమటిగాలి తిరిగి తేరుకున్నాడు. హాయవాతాని గాఢంగా కౌగలించుకొన్నాడు. పడమటిగాలి చెక్కిళ్లమీద వేడి వేడి కన్నీరు ధారలుకట్టి ప్రవహించింది. ఎంతగా ప్రయత్నించినా మాట్లాడలేక పోయాడు. చిట్టచివరకెలాగో గొంతు సవరించుకున్నాడు:

'నా కన్నతండ్రీ! హాయవాతా! మొట్టమొదట చేసినతప్పు ఒప్పుకుంటే ఇంతవరకు వచ్చేది కాదు! కాని దురహంకారంమూలాన పొరపాటుజరిగిందని ఒప్పుకోలేక పోయాను. వయస్సు ముమ్మరంలో నా కళ్ళు మూసుకుపోయాయి. పైడి బొమ్మలాంటి వెనోనాని పోగొట్టుకున్నాను. చిట్టచివరికి చేసినపాపమే నన్నిలాగ కట్టికుడిపింది. ఇప్పుడిక ఎన్నెన్నివిధాల పశ్చాత్తాపపడితే మాత్రం లాభమేమిటి? మీ అమ్మ మళ్ళీ లేచిరాదుకదా!

'సరే దీనికేమిగాని నేను బాగా పెద్దవాణ్ణయాను. ఇంకా కొంచెం వయస్సుమళ్ళినతరవాత నారాజ్యానికంతటికీ నువ్వే వారసుడవవుతావు! అయితే ఒక్కమాట. మనదేశంలో సోమరితనము, మోసాలు, అబద్ధాలు, అన్యాయాలు బాగా పెచ్చుపెరిగిపోయాయి. పాడిపంట లడుగంటిపోయాయి. నా పెద్దతనం చూసి అందరు తామే అధికారులమన్నట్లు విర్రవీగుతున్నారు. ముందుగా నువ్వు మనరాజ్యం అంతా జాగ్రత్తగా చక్కబెట్టాలి. చేతిపనులు, వ్యవసాయము, సాముగరిడీలు, విలువిద్య ఆదరించే నాధుడులేక బాగా అణగారిపోయాయి. అవి అన్నీ మళ్ళీ దారిలో పెట్టాలి. ఇరుగు పొరుగున ఉన్న శత్రువులు మాటిమాటికి మన మీదికురికి రాజ్యం అంతా కబళించి వెయ్యాలని చూస్తున్నారు. వాళ్ళని ఒక కంట కనిపెట్టిచూడాలి. నా జన్మలో ఎప్పుడు ఓటమి అంటే ఏమిటో ఎరగను. కాని చిట్టచివరికిలాగ నీచేతిలో ఓడిపోయినందుకు నాకెంతో సంతోషంగా ఉంది. నిజంగా ఇంతకంటె కోరుకోవలసింది ఏమి ఉంది.'

ఆపైన తండ్రికి బాగా బలం వచ్చేదాకా హాయవాతా అతని కోటలోనే ఉన్నాడు. రకరకాల యుద్ధాలలో కొత్తకొత్త మెళకువలెన్నో నేర్చుకున్నాడు. ఇరుగు పొరుగు పగవారి ఆనుపానులన్నీ గ్రహించాడు. ఒకనాటి ఉదయం తండ్రికెంతో భక్తితో నమస్కరించి, ఆశీర్వచనాలందుకుని ఉత్సాహంతో ఉరకలువేస్తూ తిరిగి నోకోమిస్ భవంతికి ప్రయాణమయినాడు.

పడమటిగాలి మళ్ళీ అతన్ని ఎంతో ఆప్యాయంగా కౌగలించుకుని 'నాయనా! మొట్టమొదట నువ్వు మనశత్రువుల్ని అందరిని హతమార్చి వెయ్యాలనీ, ఆపైన ఒక చక్కని చుక్కని వివాహం చేసుకుని మహా వైభవంతో వర్ధిల్లాలనీ ఆశీర్వదిస్తున్నాను' అన్నాడు. 'మీ ఆశీర్వచనంవల్ల అన్నీ ఒక్కమారే జరుగుతాయి!' అని తిరిగి తనభవంతికి ప్రయాణమయినాడు హాయవాతా!

**ఇంకా ఉంది**

---

"నిన్న రాత్రి నే నిక్కడికి వచ్చానా?" హడావిడిగా వచ్చిన వ్యక్తి హోటలుయజమానిని అడిగాడు.

"ఆ! వచ్చారు. మీ ముఖం నాకు బాగా గుర్తుంది."

"అయితే ఇక్కడ చాలా డబ్బు ఖర్చుపెట్టి ఉంటాను."

"అవునండీ. నాకే వంద రూపాయలు ఇచ్చారు."

"అదా సంగతి!" నయమే ఎక్కడో పారేశాననుకుంటున్నాను."

ఎమ్. రాజారాం (హైదరాబాద్)

---

వీళ్లంతా లలితాంబగారి వరండాలో లోకాభి రామాయణం మొదలెట్టేరు.

చరిత్రలో విచిత్రమైన మార్పులు, భూగోళంలో కొత్తకొత్త హద్దులూ, ఎల్లలూ, శాస్త్రంలో అద్భుతాలూ, విడ్డూరాలూ సాధిస్తున్న నవీన యుగంలో కూడా వీళ్ళ అంతర్జాతీయ రాజకీయాలకి గాని దేశీయప్రణాళికల జోలికిగానీ పోరు.

అయితే వాళ్లకున్న పరిధుల్లో వాళ్ల లోకానుభవమూ, పరిజ్ఞానమూ చాలా యెక్కువ. ఆవేళ చర్చ నరసమ్మగారియింట ఇటీవల వస్తున్న మార్పులు.

"ఎంతేనా ఇంటిగలదీ! .... పొమ్మన్నా పొమ్మంటుంది. కాస్త మెల్లిగా మాటాడే కోడలా!" అన్నది నిరంజనంగారి విధవప్పచెల్లెలు.

"ఉన్న మాటంటే వులు కెక్కువనీ .... ఎందుకు పొమ్మంటుంది? .... అదీగాక మా రాజ్యలక్ష్మిలో అడ్డమైన చాకిరీ చేయించుకోవాల నుందేమిటి ?... నేను యెంత పాలు పెరుగూ పోసి పెంచితే మాత్రం అది ఎత్తేర్నతుందీ ? .... " అన్నది లలితాంబ. కుండ బద్దలుకొట్టినట్ను మాటాడ గలనని ఆవిడ గర్వం.

"నిర్మలట నిర్మల! ... పేరూ దుర్గి .... రూపూ కురూపి అని .... దానికి వాడు డాబామీద పాఠాలుట!! .... అవ్వ .... ఎరుగమే .... బ్రాహ్మణ్యం పోతే పోయే... సిగ్గూ, లజ్జా ఉండొద్దూ....?" అంటూసుభద్రమ్మ రంగంమీదికి దిగింది.

"అదిసరే వదినే! అతగాడు చాలా మంచివాడే. ఇలా వంచినతల యెత్తడే తల్లీ ...."— నిరంజనంగారి కోడలు సూర్యానికి సర్టిఫికేటు ఇచ్చింది.

"అలా అనకు. ఎంత మంచి కుక్కయినా .... అన్నట్ను ఆడది హరిబ్రహ్మాదులను సయితం వెర్రెత్తిస్తుంది! అందులోకీ మొగుడూ .... మొద్దులూ లేనిదైతే మరీనూ!" అన్నది లలితాంబ.

"ఔనే కోడలా!" అంటూ నిరంజనంగారి విధవప్ప చెల్లెలు కొంచెం ఇసింటా జరిగింది — "యిప్పుడీ, జయరావూ, కూతురు ఈ రాకపోక లేమిటో" నంది—

"మేం, ఈ గడపతొక్కి అయిదేళ్లయ్యింది. ఆవాళనుంచీ నరసమ్మగారి కొంపకి చుట్టంగానీ పక్కంగాని వచ్చినపాపాన పోలేదు! .... వెలివేసినట్ను ఆమే, ఆ మనుమడూ తప్ప — ఇవాళ ఓ అందాల భరిణతో సహా, అతగాడి మేనమామనంటూ ఓ రంగధామయ్య దిగబడ్డాడు ...." అంటూ చేతులు, మూతీ త్రిప్పి, అలిసిపోయింది లలితాంబ.

"ఔనౌను సుమా" అన్నారు తతిమ్మా బృందం. అంటే తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించేరన్నమాట.

అంతలో సుభద్రమ్మ మరో ప్రతిపాదన పెట్టింది. ఆమె తన భర్త నోటివెంట ఉదయం లేస్తే సాయంకాలందాకా తినని తిట్టు ఉండదు. అతగాడు కోపమొస్తే మనిషికాడు.

పాలవాడితో రెండుక్షణాలు మాటాడిందో వాడి యోగక్షేమాలు కనుక్కుందో "వాడు నీ మేనత్త కొడుకా ?" అంటూ చిందులుతొక్కే స్వభావం అతగాడిది.

# విడీ విడని చిక్కులు

23-వ పేజీ తరువాయి

అందుచేత సుభద్రమ్మ దేశంలోని ప్రతీ మగా, ఆడనీ దుమ్మెత్తిపోస్తుంది.

ఆమె చెప్పింది "ఈడొచ్చిన పిల్ల .... మీ రాజ్యలక్ష్మి స్ఫటికం లాంటిది! .... ఏమో ఎవరు చెప్పగలరు? అరటాకూ—ముల్లూ అన్నారు .... అటుకేసి పంపకుమా వదినే!" ......

"ఈ, కుర్రముండ ఉండదుకదా! అమ్మొమ్మో అంటూ అక్కడే ఛస్తుంది. ఇంకెన్నాళ్ళలే! .... ఆ మూడు ముళ్ళూ వేయించేస్తే!" నంది; పీడ విరగడవుతుందన్నట్ను చేతులు విరుచుకుని లలితాంబ.

రెండు తీర్మానాలయ్యేయి గనక చర్చమాని పిచ్చాపాటికి దిగింది సమావేశం.

"ఔనుటే ? నేనోమా టడుగుతాను, ఏమీ అనుకోవుగద ?" అన్నది లలితాంబ నిరంజనంగారి కోడల్ని. అని ఆపిల్లజవాబుకు నిరీక్షించకండానే

---

అనుభవజ్ఞుడైన శాసనసభ్యుడొకరు కొత్తగావచ్చిన శాసనసభ్యులతో ఇలా అంటూండేవాడు: "మీరు అట్టే బెదరిపోకండి. మొదటి ఆరునెలలు శాసనసభకు ఎలా వచ్చామా అని ఆశ్చర్యపడటంతోనే గడిపేస్తారు. ఆ తరవాత ఇతరులు ఎలా వచ్చారా అని ఆశ్చర్యపోతూ గడిపేస్తారు."

పి. అన్నపూర్ణ (నిడుబ్రోలు)

---

"మీ ఆయన ఈమధ్య ఇంటిపట్టున ఉంటున్నాడా?" అని ప్రశ్న వేసింది.

విధవప్పచెల్లెలు ముసుగు సవరించుకుంది.

నిరంజనంగారి కోడలిపిల్ల దమ్మిడీ అంతవదనం చేసుకుంది. "వస్తూన్నారు" అంది కోపంగా—

నిరంజనంగారి విధవప్పచెల్లెలు "అయ్యో! కాఫీల వేళయ్యిందే" అంటూ లేచింది.

ఆమెను కోడలుపిల్ల కూడా అనుసరించింది.

"తనదాకా వస్తేనేగాని తగూ తెలీదుట."

సుభద్రమ్మ, లలితాంబ యిద్దరూ నవ్వుకున్నారు.

ఇక్కడ నిరంజనంగారి కుటుంబం సంగతి కాస్త చెప్పాలి.

అసలు నిరంజనంగారు కీర్తిశేషులై రెండు సంవత్సరాలైంది. కొడుక్కి పెళ్లిచేసిన సంవత్సరమే అతగాడు కాలధర్మం చేసేడు.

కాని, ఉన్నన్నాళ్లూ అన్ని వాటాలవాళ్లకీ తలలో నాలికలాగ మసిలేడేమో, ఆయన తదనంతరంకూడా నిరంజనంగారి వాటా, నిరంజనంగారి కోడలు, నిరంజనంగారి అప్పచెల్లెలూ, ఇత్యాది స్థిరమైపోయేయి.

నిరంజనంగారి కొడుకు నూటయాభై రూపాయలార్జిస్తాడు. తెచ్చి మేనత్త కిస్తాడు. మూరే ఇస్తూన్నాడంటుం దామె. నూటయాభై అంటుంది కోడలు.

నిరంజనంగా రున్ననాటి నుంచీ, పెత్తనం తన పంచను చేరిన విధవప్పచెల్లెలిదే.

అదీగాక, ముకుందరావు వ్యసనాలకి బానిస. సాధారణంగా పెళ్లాంతో కులాసాగా ప్రవర్తించడు. రకరకాలుగా అనుకుంటారుగాని నిరంజనంగారి విధవప్ప చెల్లెలి నోటికి ఝడిసి లోపల లోపలే అనుకుంటారు.

పైగా యిటీవల అతగాడిమీద సానుభూతి కూడా చూపిస్తున్నారు.

ఏమంటే "మగరాజా! వీధిలో రకరకాలుగా తిరుగుతున్నాడుగాని యింట్లో వీరాంగం వెయ్యలేదుగా" అంటారు.

## 29

ఉదయం సూర్యం ఆఫీసువేళకి జయరావుగారింకా రాలేదు.

"సరే మీనాక్షీ! మళ్లీ మరోసారి మీ కుటుంబం అంతటినీ తీసుకురాండి" అని బయల్దేరిపోయేడు సూర్యం.

ఆఫీసుకి వెళ్లే తొందరలో జయరావుగారి గురించి యిదివరకటి దురభిప్రాయాన్నిగాని, మీనాక్షిమీద అప్పుడుకలిగిన సదభిప్రాయాన్నిగాని అతగా డాలోచించలేదు.

అరగంట ఆలస్యం కూడా అయ్యేడు ఆఫీసుకు.

"వచ్చేరా! అమ్మయ్య! .... ఇంక ఆఫీసుపని తొందరగా అవుతుంది" మంగపతి క్యాష్‌బాక్సు తెరుస్తూ నవ్వేడు.

రీటా సూర్యానికో చిరునవ్వు పారేసి "గుడ్ మార్నింగ్" అంది. టయిపుమెషిను పడపడ లాడించింది.

సూర్యం గుండెలమీద మంగపతినవ్వు కారంజల్లి నట్లుంది. దాన్ని రీటా వెన్నెలలాంటి చిరునవ్వు తొలగించలేకపోయింది.

మధ్యాహ్నం విరామసమయంలో రీటా లేచి సూర్యం బల్లదగ్గరికి వచ్చి "మీరు కాఫీ తాగుతారా .... పోదాం" అన్నది.

సూర్యం మంగపతికేసి తిరిగి "మీరు ?" అన్నాడు.

"వద్దు వద్దు .... నా దారిన నే పోతా! హెడ్ క్లార్కు చూస్తే భగభగా మండిపోతాడు" అన్నాడతి మంగపతి.

"దగ్గర్లో యేదీ రెస్టొరెంటు లేదు" అన్నాడు సూర్యం.

రీటా నవ్వింది "పరవాలేదు" అన్నది.

సూర్యం చిక్కు ప్రశ్న విన్నట్లు మొహం పెట్టేడు. "నేనీ దేశంలో పుట్టేను. మా అమ్మా! నాన్నా కూడాను .... మా "మామ్మ" మాత్రం

ంగ్లండ్‌లో పుట్టిందని మా అమ్మ చెబుతుంది"— రీటా చెప్పింది.

కాఫీహొటల్లో బిస్కట్లు తింటానంది రీటా.

"శభాష్! బాగుంది .... మీ భారతీయత యింత వెర్రెక్కి వచ్చింది. ఇడ్లెన్లు తినొద్దా ?" సూర్యం యిద్దరికి బిస్కట్లు తెప్పించేడు.

"మరి .... " అని యేదో చెప్పబోయిన రీటా ఊరుకుంది.

మళ్లీ ఓ బిస్కట్ కొరికి అన్నది "నేను బొంబాయిలో వో కంపెనీకి రిసప్షనిస్టు ఉద్యోగం కోసరం అర్జీ పెట్టుకున్నాను."—

సూర్యానికి నవ్వొచ్చింది. తాటిచెట్టు దూడ గడ్డికి ఎక్కేనన్నట్లుం దాపిల్ల జవాబు. అయితే ఆ సామెత యింగ్లీషులోకి తర్జుమా చెయ్యడం రాలేదు.

"బసీ .... అంచేత మీరు బిస్కట్లు తింటారు" నవ్వేడు.

"అందం, ఒయ్యారం, వయసూ, ఆరోగ్యం అన్నీ చూడందే ఆ ఉద్యోగా లివ్వరుగా .... అందుకని మా అమ్మ నన్ను రేషనుమీద ఉంచుతున్నది" రీటా బోధపర్చింది.

సూర్యానికి అర్థం అయ్యింది. వాళ్ళ సాంప్రదాయాలు, విదేశీ సూత్రాలకి నకిలీగా ఉంటాయి.

"వర్కింగ్ గర్ల్" అంటే ఇలా ఉంటుందన్న మాట అని తలపోశాడు.

రీటా ఇరవైనాలుగ్గంటలూ, తన అందం, తన నడవడీ ఈ రెండింటిని గురించి జాగ్రత్త తీసుకుంటూనే ఉంటుంది.

ఆమె గోళ్లమీద కాంతులు ప్రతిఫలిస్తున్నాయి.

ఆమెబుగ్గలు నున్నగా జున్నుముక్కల్లాగ ఉన్నాయి. జెబ్బలు ఒలిచిన దవ్వల్లాగ ఉన్నాయి.

సూర్యం సిగరెట్ తీసి "అభ్యంతరం" అన్నాడు.

రీటా నవ్వింది. తన వానిటీబాగ్‌లోనించి చిన్న సిగరెట్‌పైపు తీసింది. సూర్యం గారడీవాడు. గంపలోనించి పామును తీస్తే చూసినట్లు చూసేడు.

"రోజుకి మూడు మాత్రమే.... లేక పోతే అమ్మ చంపేస్తుంది" సిగరెట్ తీసుకుని అందులో గుచ్చింది.

సూర్యానికి ఆమె సిగరెట్‌ను ముట్టించడం రాలేదు. చేతులు ఒణికేయి. ఆమె అది గ్రహించి సూర్యం దగ్గిర అగ్గిపెట్టె తీసుకుని అతగాడి సిగరెట్టుతీసుకుంది. ముట్టించి యిచ్చింది.

"థ్యాంక్స్"అన్నాడు సూర్యం ఉగ్గబట్టుకొని.

ఈ దృశ్యం మిగతావాళ్లకంటే యెక్కువ దూరంగా ఉన్నా మంగపతిని ఆకర్షించింది. ఉక్కిరిబిక్కిరి అయ్యేడు—ఉడుకుమోత్తనంలో కాఫీ కప్పులో బుర్ర దూర్చేసుకుంటాడా అన్నంత ఇదయ్యేడు.

మంగపతి అతగాణ్ణి అంతర్ బాహ్యప్రవృత్తులు రెండందాల, జులాయి క్రింద కట్టేసేడు. "రీటా" తనను పిలవక పోవడంవినా అతని అక్కసుకి మరో కారణం లేక పోయినా, "సాటి తెలుగుకుర్రోడు దొరసాని ఒళ్లో పడుతున్నాడే" అన్న బాధ పడుతున్నానంటాడు.

ఇంతకీ అది వలలో పడడమా ? అన్న ప్రశ్న ఉదయించలేదు మంగపతి బుర్రలో.

కాలేజీలో అమ్మాయిలూ, అబ్బాయిలూ మాట్లాడుకోడం చూసి లెక్చరర్లు పడే బాధ లాంటిదే మంగపతిది.

సాయంత్రం "ఏవండీ గోపాలకృష్ణుడు గారూ! మాక్కూడా కాస్త కాఫీనీళ్లు పోయిద్దురూ" అన్నాడు.

"నేను గోపాలుణ్ణీ కాదూ, కృష్ణుణ్ణీ కాదు...." సూర్యం కోపం కొంచెం ఎక్కువపాళ్లలోనే ప్రదర్శించేడు.

"ఎంతమాట ? కాదంటే ఎలాగ .... బొడ్డుకోసిన్నాడు పెట్టిన పేరు సార్థకమా యేమిటి? న్యాయానికి మనిషితత్వానికి యే పేరు సరిపోతుందో అదే ఉండాలి." విడమర్చి చెప్పి పళ్లు ఇకిలించాడు మంగపతి.

సూర్యం, మంగపతికి సిగరెట్ ఇవ్వకపోగా "కాఫీ యిప్పుడు తాగ" నని కూడా చెప్పడం—ఇదే మొదటిసారి.

"ఔనౌను .... శంకరంగారింటి కెళ్లాలి కాబోలును" మంగపతి తనే పొరపాటు చేసినట్లు నొచ్చుకున్నాడు.

" .... " సూర్యం పళ్లు కొరకడం వినా మాటాడలేదు.

మంగపతి వెళ్లినతర్వాత, శంకరంగా రింటికి వెళుతున్నవాడల్లా ఎందుకో మనస్కరించక తిరిగి ఇంటిదారి పట్టేడు.

ఎవరినో ఎదుర్కొనవల్సిన అవసరమూ—తన స్వేచ్ఛకి ఏవో ప్రతిబంధకాలు ఉన్నట్లూ అడుగడుగునా తోచిం దతగాడికి.

## 30

గుమ్మంలో అడుగు పెడుతూఉండగానే, అతని లోని ఆందోళన చెరిగిపోయి మరేదో కొత్త వెరితి దేవినట్లయ్యింది.

తన ఇంట అడుగు పెడుతూనే అతని ఆందోళన నిజమయ్యింది, వరండాలో మనుషులు—మీనాక్షీ, నిర్మలా, రాజ్యలక్ష్మీ .... నిరంజనంగారి విధవప్పచెల్లెలితో సహా మూగిఉన్నారు.

నరసమ్మగారు మంచంమీద — "అయ్యో, అబ్బా !...." అని మూలుగుతున్నది.

"బామ్మా ? .... అరే .... యేం జరిగిందీ ?" సూర్యానికి చెమటలుపట్టేయి. కరచరణా లాడలేదు.

మిగతావాళ్లందరికంటే ధైర్యంగా ఉన్న నిరంజనంగారి విధవప్ప చెల్లెలు చెప్పింది :

"మరేం గాభరాపడకు ? .... డాక్టరు వచ్చి ఇంజెక్షను యిచ్చి వెళ్లేడు .... మరేంలేదు, పెద్ద వయసా ? .... నూతిగట్టుదగ్గిర కాలు జారింది .. అదీ ఉదయం....."

సూర్యం ఆందోళనగా బామ్మమంచంమీద కూచున్నాడు.

రాజ్యలక్ష్మి అతను ఆందోళనపడుతూంటే బిక్కమొహం వేసుకుని చూసింది.

"ఎప్పుడూ ?" సూర్యం అడిగేడు.

"ఉదయం .... మేం వెడదా మనుకుంటుంటే" నని మీనాక్షి చెప్పింది.

"డాక్టర్నెవరు పిలిచేరు ? యేమన్నాడూ ?" సూర్యం నరసమ్మగారి కేసి తనను గుర్తించమన్నట్లు ఆశగా చూస్తూ అడిగేడు.

"నిర్మల పిలిచింది" నిరంజనంగారి విధవప్ప చెల్లెలు చెప్పింది. "ఆ పిల్లే లేకపోతే, మొగాళ్లందరూ ఆఫీసులకి వెళ్లిపోయేరు .... డాక్టర్ని ఎవరం పిలవగలం ? .... నేనా ? బోడిముండని .... మిగతావాళ్లు ఆడకూతుళ్లాను .... అవి డాక్టర్తే దేవుడిలా అడ్డుకుంది" అని—

నరసమ్మగారు కళ్లు తెరిచింది.

"అయ్యో ! రామయ్య తండ్రీ ! నే భరించలేనురా యీ బాధ .... " అంటూ మూలిగి "వీడికి కాఫీ యివ్వవే మీనాక్షి తల్లీ" అన్నది.

ఆవిడకు మక్కు బెణికింది .... వయసు మళ్లిందేమో తట్టుకోలేకపోయింది.

"డాక్టరు కాపడం పెట్టండని చెప్పేడు" అని మీనాక్షి వెళ్లి సూర్యానికి 'కాఫీ తెచ్చింది.'

సూర్యానికి భయం వేసింది. ఏ 'చెట్టునీడ' నయితే తను నిశ్చింతగా కాలం వెళ్లబుచ్చుతున్నాడో, ఆ మహావృక్షం తనకు ఇక ఎన్నాళ్లోదక్కదేమో ......

"పోయి డాక్టర్ని తీసికొస్తా" నంటూ లేచేడు విసురుగా.

"అక్కర్లేదు .... రేపు ఉదయం వస్తారు. అడిగినప్పుడల్లా గ్లూకోజు యిమ్మన్నారు. "పోమెంటేషను చెయ్యమన్నారు .... మరేం ఫర్వాలేదు...." అంటూ నిర్మల వారించింది.



మీనాక్షి కూడా అదే అన్నది.

"అమ్మో ! అదేమిటమ్మా ! అలా అధైర్య పడతావ్ ? యిలాంటప్పుడు కాదూ ధైర్యం ! ఏదో కాలుజారిందంటే ! .... నేను యిందుకు మంత్రం కూడ వేశా" నంటూ వెళ్ళిపోయింది నిరంజనంగారి విధవప్ప చెల్లెలు.

కాపడం యెవరు పెడతారు ....

మీనాక్షా ! కాలేజీలో చదువుకోవడం తప్ప యిలాంటికి రావు.

రాజ్యలక్ష్మి ? .... ఆపిల్ల వొంటిమీద మరుగు నీళ్ళు పోసుకోకుండా ఉంటే అదే పదివేలు .... అధవా కాపడం పెట్టగలిగినా .... వాళ్ళ, పిన్ని ఎముక లేరేస్తుంది.

నిర్మల అందుకు పూనుకుంది. ఆపిల్ల బడికి శలవు పెట్టింది మధ్యాహ్నం వెళ్ళి.

## విడీ విడని చిక్కులు

కృతజ్ఞతతో సూర్యం కళ్ళు మెరిశాయి.

"మీరు .... ముఖ్యంగా, మాస్టారూ అంతా అవతలికి వెళ్ళండి .... కాపడం పెట్టాలి ...." నిర్మల ఆజ్ఞాపించింది అందర్నీ.

"బజారుకెళ్ళి పళ్ళు తేనా ?" సూర్యం ప్రశ్న వేశాడు లేస్తూను.

మూలుగుతూనే నరసమ్మగారు "ఒరే .... ఎక్కడికీ వెళ్ళకురా" అన్నది.

సూర్యం తిరిగి ఆమె దగ్గరకూచుని "లేదే... యిక్కడే ఉంటా" నన్నాడు.

"భేష్ ! బాగుంది .... బయటికి పొమ్మంటే ?" నంది మీనాక్షి చతికిలబడ్డ సూర్యాన్ని కొంటెగా చూసి.

సూర్యం, చాలా బరువుగా ఎక్కాడు. దేవుణ్ణి ప్రార్థించాలని బలమైన కోరిక కలిగింది.

ఎనిమిది గంటలు అయ్యేవరకూ ఆ లోగిలిలోని జనాభా అంతా చూస్తూనే ఉన్నారు. ఎలా వస్తాడో ఏమిటో నంటూ. జరిగింది చెప్పలేక ఆడపిల్లల ప్రాణం విసిగిపోయింది.

నిర్మలకి వండడం వచ్చును, కాని వండగల ధైర్యం లేదు .... హక్కున్నూ లేదు.

మీనాక్షికి వచ్చునో, రాదో ఆ పిల్లకే తెలియాలి.

రాజ్యలక్ష్మికి వాళ్ళ పిన్నిదగ్గర గల భయం కూడా ఆవేళ నరసమ్మగారి మంచం దగ్గర్నుంచి కదలలేకపోయింది.

(సశేషం)

---

ఇవన్నీ తాము అంతకుముందే దొంగిలించిన ఒక కారులోవేసి పారిపోయారు.

పోలీసువారు వెంటనే తమ కర్తవ్యం నెరవేర్చటానికి ఉద్యుక్తులయ్యారు. ఆ బార్‌లో డబ్బు పోగొట్టుకున్నవారిలో ఒకరు దొంగల కారునంబరు గమనించి చెప్పారు—కాని కారు చిక్కలేదు.

ఈ దోపిడీవల్ల దొంగలకు చిక్కింది 85 డాలర్లు మించలేదు, అయిదు విస్కీ సీసాలను మినహాయిస్తే!

* * *

అప్పటికింకా సూర్యోదయం కాలేదు. న్యూజెర్సీ రాష్ట్రం పోలీసులు ఇద్దరు— జస్ జి. పేటే, అతని సహోద్యోగి వారెన్ జె. యస్నర్ పోలీసు కారులో డ్యూటీమీద తిరుగుతున్నారు. ఏదో ఒక లారీని తనిఖీ చెయ్యటానికని దక్షిణంవైపుగా ప్రయాణం చేస్తూ ఉండగా, ఒక కారు ఉత్తరంవైపుకి అతి వేగంగా దూసుకుపోయింది. మరీవేగంగా పోతున్నారని వీరిద్దరూ వెనక్కితిరిగి ఆ కారుని వెంబడించారు. రెండు వందల గజాల దూరం కొన్ని నిముషాలపాటు ఉండగా ముందు కారులో ఒకడను తుపాకీతో కాల్చటం ప్రారంభించాడు.

పోలీసుకారు అద్దం ముక్కలు ముక్కలై పోవటమేకాక, యిస్నర్ వెంటనే చనిపోయాడు. పేట్ పై అధికారులకు సంగతి తెలియజేయగానే మరి కొన్ని పోలీసుకారులు వేటలో పాల్గొన్నాయి. ఇది చివరకు జెర్సీ సెంట్రల్ స్టేషన్ వెనక 'యార్డు'లలో ముగిసింది ఒక చిన్న తుపాకీయుద్ధం జరిగింది. వారి కారు, దానిలో కొన్ని విస్కీసీసాలు వదలి దొంగలిద్దరూ పారిపోయారు.

ఈ కారు, విస్కీ సీసాలుచూసి అంతకుముందు బార్‌లో దోపిడీ చేసినవారే యిస్నర్‌ను చంపిన వారని పోలీసులు గ్రహించారు. కారులోనూ, సీసాలమీదా దొరికిన వేలిముద్రలు పరీక్షించగా, దొంగలెవరో తెలిసిపోయింది. న్యూవర్కునుంచి 32 ఏళ్ళ ఎడ్వర్డ్ మెటలెస్కీ, ఫిలడెల్ఫియాలో దొంగతనంచేసి, జైలుకి వెళ్ళిన ఆల్బర్ట్ మార్టిన్ (వయస్సు 26.)

వేలిముద్రల పరీక్ష జరుగుతూఉండగానే ఎడ్వర్డ్ మెటలెస్కీ ఒక చిన్న రైల్వేస్టేషన్‌లోకి తూలుతూ వచ్చాడు. పొలాలమధ్యనుంచి పరిగెత్తుకుంటూ

## హంతకుడికోసం జుట్టు కిరంగు

17—వ పేజీ తరువాయి

వచ్చాడేమో వంటినిండా బురద అంటుకునిఉంది. చర్మం కూడా కొన్నిచోట్ల గీసుకుపోయిఉంది. దొరికిపోయిన మార్టిన్ పోలీసువారడిగిన ఏ ప్రశ్నకీ జవాబు చెప్పలేదు. కాని అతని ఫోటో చూసిన తర్వాత ఫిలడెల్ఫియా బార్‌లో దొంగతనం చేసింది ఇతనేనని సాక్షులు నిర్ధారణ చేశారు. మెటలెస్కీని మిడిల్ సెక్స్‌జైలు — న్యూజెర్సీ రాష్ట్రంలో న్యూబ్రన్స్‌విక్ అనే వూరిలో జైలు పేరు — ఉంచారు. మార్టిన్‌కోసం అన్వేషణ ప్రారంభమయింది.

సోమవారం పొద్దున, అంటే యెస్నర్ హత్య జరిగిన రెండురోజులతర్వాత, ఫిలడెల్ఫియారాష్ట్రం పోలీసువారు ఒక ఆత్మహత్య కేసు విచారణచేస్తూ, మరణించినవ్యక్తి ఆల్బర్ట్ మార్టిన్‌తప్ప వేరెవరూ కాదని తెలుసుకున్నారు.

మెటలెస్కీమీద హత్యా నేరారోపణ ఉండిపోయింది. విచారణ డిసెంబర్ 13 కి వేశారు.

* * *

దీనికి మూడురోజులముందు మెటలెస్కీని చూడటానికి ఒక అమ్మాయి వచ్చింది. ఆమె జుట్టు బంగారంరంగులో ఉంది. ఖైదీకి ఆమె పాత స్నేహితురాలని తెలిసింది. ఆమెను చూసిన జైలు డిప్యూటీ వార్డెన్, రక్షకులు 'నిజంగా అందగత్తె' అన్నారు.

ఇది డిసెంబర్ 10 వ తేదీన; మర్నాడు ఆరు గంటలకు కొంచెం ముందు మెటలెస్కీకి భోజనం పట్టుకువచ్చిన ఒక జైలు అధికారికి పిస్తోలుతో ఆహ్వానం దొరికింది. అతనివద్ద తాళం చెవులు తీసుకుని, మెటలెస్కీ అధికారినే లోపలపెట్టి తాళం వేసేశాడు! మరో ఖైదీ, పాల్ సెమెంకెవిట్జ్‌ని విడుదలచేసి అతనితోబాటు బయటకు తప్పించుకున్నాడు.

న్యూబ్రన్స్‌విక్‌లో ఒక కారు దొంగిలించి ప్లెయిన్‌ఫీల్డ్ అనే ఊరివైపుకి వెళ్లారు వారిద్దరూ. ప్లెయిన్‌ఫీల్డ్ పరిసరాలలో ఒక 'లాడ్జింగ్'ని దోచి, దాని యజమానికారుతో తప్పించుకుపోయారు. తిరిగి ఆ కారుని చిత్తుచేసి, దగ్గరలోనేఉన్న వాట్‌చుంగ్ కొండలలోకి పారిపోయారు.....

హెన్రీ చిక్‌లెట్ తనకి ఏ పిస్తోలు సంగతి తెలియదన్నదికాని అరెస్టుచేసి జైలులో ఉంచారు. డిటెక్టివ్‌మెటలెస్కీ దాక్కొనటానికి చోటు కూడా ఆమెయే ఏర్పాటుచేసి ఉండాలని ఊహించారు. ఊరంతా గాలించటం మొదలుపెట్టారు. బంగారు రంగు జుట్టుకల ఒక స్త్రీ ఎక్కడయినా గదికాని, ఇల్లుకాని అద్దెకు తీసుకుందా అని అన్నిచోట్లా అడిగారు. ఎవరూ ఏమీ చెప్పలేకపోయారు!

అయితే జైలులో ఒక స్త్రీ అధికారి హెన్రీచిక్‌లెట్ కేశాలు పసుపురంగువి కావని అనుమానించింది. రంగువేసిన వారం రోజులలో పసుపుకింది ఎరుపు కనిపించడం మొదలుపెట్టింది.

* * *

ఆపైన పరిశోధనలు చకచక జరిగిపోయాయి. ఎర్రటి జుట్టుకల ఒక స్త్రీ డిసెంబర్ 9 వ తేదీన ఒక గది అద్దెకు తీసుకున్నాడని తెలుసుకుని— ఆగది 'తనకీ తన భర్తకీ' అని ఆ స్త్రీ అన్నదట— పోలీసులు అక్కడ కాపలాపెట్టారు. డిసెంబర్ 18, బుధవారంనాడు మెటలెస్కీ, సెమెన్‌కెవిట్జ్ లిద్దరూ పట్టుబడ్డారు. సెమెన్‌కెవిట్జ్ వెంటనే లొంగిపోయాడుకాని యెస్నర్ హంతకుడుమాత్రం తన పిస్తోలును అందుకోబోయి విఫలుడైన తర్వాతనే లొంగిపోయాడు. ఆ పిస్తోలు హెన్రీ తన కిచ్చిందని మెటలెస్కీ ఒప్పుకున్నాడు.

మెటలెస్కీకి సాయపడినందుకు హెన్రీచిక్‌లెట్‌కి అయిదేళ్ళ శిక్ష వేశారు. సెమెన్‌కెవిట్జ్‌కి మరొక పదిహేను సంవత్సరాల శిక్ష అదనంగా వేశారు.

జనవరి 6, 1936 ఎడ్వర్డ్ మెటలెస్కీ కేసు విచారణ ప్రారంభమయింది. మొదటిడిగ్రీ హత్య చేసినట్లు రుజువు అయింది. నెలరోజుల తర్వాత ట్రెంటన్ అనేచోట మెటలెస్కీ మరణశిక్ష అనుభవించాడు. ★

కాని రావుగారూ, లలితమ్మగారు వేరే ఆలోచనల్లో పడి బదులు చెప్పలేదు. ఆఖరుకు లలితమ్మగారు,

"ఇక్కడున్నంతకాలమూ ఏదో వంది, తోట అంటూ ఇలాగే గడిచిపోతుంది. ఇంకెన్నాళ్ళులే!" అన్నారు.

"అంటే?" తల్లిమాటలు ఇందిరకు నిజంగానే అర్థంకాలా.

"పెళ్ళిచేసుకొని అత్తవారింటికి వెడితే ఏం జేస్తావు? నీ భర్తకు ఏబస్తీలో ఉద్యోగం ఉంటుందో ఎవరికేం తెలుసు?"

తన జీవితంలో తొలిసారిగా తన పెళ్ళి ప్రస్తావన విన్న ఇందిర అందరు పిల్లలలాగానే,

"నే నసలు పెళ్ళే చేసుకోను" అంది.

"అంటే ఇలాగే ఉంటావా?"

"ఊఁ"

"విన్నారా ఇందిర మాటలు. ఉన్నది ఒక్కపిల్ల. అగి సన్యాసిని అవుతుందిట.

"ఇకనేం. అమ్మాయి సన్యాసినిఅయితే ఈ తోట, కూలీలు ఈ జంజాటమంతా మనకెందుకు? ఓ పూరిల్లు అయితే చాలు" అన్నారు రావుగారు.

ఇందిర ఆశ్చర్యంగా తండ్రివేపు చూసింది. ఇంతవరకూ ఇందిర కీవిషయం స్ఫురించనేలేదు. అవును. ఎవరికోసం ఆయన ఈ శ్రమంతా పడుతున్నారు? తన కోసమేనా? అంతేకాదు ఆయన దృష్టి ఇంకా ముందుకు ప్రసరించింది. తనకోసం, తన పిల్లలకోసం, మనుమలకోసం.........

అప్పుడే తనకు పెళ్ళీడు వచ్చేసింది! పుట్టయ్య వీపుమీద కూర్చుని స్వారీ చేస్తూ, తోటలో తిరుగుతున్నది ఇంకా బాగా గుర్తుంది తనకు. అప్పుడే తాను వధువు!

"ఇప్పుడప్పుడే పెళ్ళిచేసుకోవటం నాకేం ఇష్టం లేదు."

"ముసలిదానివయ్యాక చేసుకుంటావా?"

రావుగారు మధ్యలో అందుకుని, "చూడమ్మా ఇందిరా, ఇప్పుడు నీ పెళ్ళిసంగతి ఎందుకు వచ్చిందంటె ఒక సంబంధం మా దృష్టిలో ఉంది. ఆ అబ్బాయి నీకు నచ్చితే పెళ్ళిప్రయత్నం చేద్దామని........"

"వాళ్ళింట్లో ఒప్పుకోవద్దూ?"

"అందరూ ఒప్పుకొంటేనేగా పెళ్ళి. మొన్న ఇక్కడికి వచ్చారే మోహన్‌రావ్. ఆయన్ను గురించే"

ఇందిర తలవంచుకుని కూర్చుంది.

మోహనుని అందమైన మొహం వెన్నెల్లో తేలుతూ తనదగ్గరకు వచ్చినట్టయింది. ఎంత మనోహరరూపం అతనిది! అంతవరకూ పురుషులంటె విముఖంగా ఉంటున్న ఇందిర హృదయం మోహనుణ్ణి చూసినరోజున వేగంగా స్పందించింది. బాలికాసహజమైన మధురమయిన యోచనలనుండి అతిదూరంగా ఉంటున్న ఇందిర మనస్సు మోహనుని సామీప్యంతో పులకితమయింది.

ఆరోజు ఉదయం పుట్టయ్య, మోహనులతో తోటలో తిరుగుతున్నప్పుడు మోహనుని అందమైన నుదుటిమీదకు నల్లటి మబ్బుల్లాగ ముసిరే ముంగురులను సవరించాలనిపించింది ఇందిరకు. ఒక దిబ్బ ఎక్కుతూ, ఆయాసంతో కాస్సేపు నిల్చున్న

# వెండిమబ్బు

16 వ పేజీ తరువాయి

పుడు తన ప్రక్కనే నిల్చున్న మోహనుని ఆనుకుని నిల్చుందామనిపించింది. ఆమెహృదయం ఇంకా ముందుకు ఆలోచించలేదు. అప్పుడే యౌవనంలో అడుగుపెట్టిన బాలికకు, సుందరయువకుణ్ణి చూస్తే కలిగే మధురభావనలతో ఆమె హృదయం మెత్తబడింది.

కాని, ఇందిర తన భావనలను పైకి కనపడనీయదు. ఆమెహృదయం తాపేలు చిప్పవంటిది.

మాట్లాడకుండా కూర్చున్న ఇందిరను, తల్లీ, తండ్రీ చూస్తున్నారు.

"ఏం చెపుతావమ్మా?"

ఇందిర తల పైకెత్తి తల్లివైపు చూసింది.

"నా అంగీకారం ఒకటేనా కావలసింది?"

"ముందు నీ ఇష్టం తెలుసుకొని, తరువాత మిగతా సంగతులు చూద్దామని" అన్నారు రావుగారు వాత్సల్యపూరిత నేత్రాలతో చూస్తూ......

"ఇలాంటి చిన్నతగాదాలు మీలో మీరు పరిష్కరించుకోక కోర్టుకు వచ్చారా!" న్యాయమూర్తి వాదిని, ప్రతివాదిని మందలించాడు.

"మేం చేస్తున్న ప్రయత్నం కూడా అదేనండి! కాని ఇంతలో పోలీసులువచ్చి అరెస్టుచేశారు" ఇద్దరూ కలసికట్టుగా సమాధానం చెప్పారు.

ఎన్. ప్రమీలాకుమారి (కాకినాడ)

"నేను ఇప్పుడే ఏమీ చెప్పలేను. కొంచెం ఆలోచించుకోడానికి అవకాశం ఇవ్వండి."

తండ్రికి కూతురిమాట నచ్చింది.

"అలాగేనమ్మా" అన్నా రాయన.

"ఇందులో ఆలోచించుకోడానికేముంది? మేమంతా ఇలాగే చేశామా ఏమిటి? తల్లీ, తండ్రి ఎవర్ని చూపితే వాళ్ళనే చేసుకోలేదూ?"

"అందుకే నేను ఇప్పుడు అనుభవిస్తున్నాను" అన్నారు రావుగారు చిలిపిగా.

ఇందిర నవ్వి, "మంచిమాటన్నావు నాన్నా" అంది.

ఇందిర చంద్రుడిని చూస్తూవుంది. రావుగారు లలితమ్మవైపు చూశారు. ఆమె ఏమీ మాట్లాడలేదు.

"నే నిక పడుకుంటాను" అంటూ, ఇందిర లోపలికి వెళ్ళింది.

కాని, పడకమీద పడుకొన్న ఎంతసేపటికి ఆమెకు నిద్రరాలేదు. తన జీవితంలో తొలిసారిగా విన్న పెళ్ళి ప్రశ్న ఆమెను కలవరపెడుతూ నిద్రను దూరం చేసింది.

మోహనుని మనోహరరూపం ఆమె కళ్ళముందు మెదలసాగింది. తోటలో అతనితో తిరుగుతూ ఉన్నప్పుడు, అతనిని చూస్తున్న కళ్ళను మరోవైపు త్రిప్పుకోవాలంటే ఇందిరకు చాలా కష్టమనిపించేది. కాని ఆమె చూపుల్లో చెడుభావనలేమీ లేవు. వెన్నెలకాంతిలో మెరుస్తూ నిల్చున్న గిరిని చూస్తూ మైమరచినట్టు, మధురవాసనలతో ఆకర్షితురాలై తెల్లనిపూలను ధరించిన సచ్చటి కాఫీచెట్లనుచూసి, తన్మయురాలైనట్టె, మోహనుణ్ణిచూసి ఇందిర తన్నుతాను మరిచేది. అతని దర్శనంవల్ల ఆమె కళ్ళు, హృదయం సౌందర్యారాధనతో సంతృప్తిపొందేవి.

"అతన్నే భర్తగా పొందితే?"

రూపవతియైన భార్య భర్తకు శత్రువట. అలాగే అందగాడైన భర్త భార్యకెందుకు శత్రువు కాకూడదు. పరస్త్రీలు అతనివేపుకు ఆకర్షింపబడితే? అతని ముఖమేమో అందంగానేఉంది. కాని మనస్సు అంత అందంగానే ఉంటుందన్న నమ్మకమేముంది.

మరునాడు మళ్ళీ రావుగారూ, లలితమ్మ అడిగినప్పుడు ఇందిర ఏమీ చెప్పలేకపోయింది. తలవంచుకుని, "ఏం చెప్పాలో నాకేం తోచటంలేదు నాన్నా. నీ అభిప్రాయం ఏమిటి?" అంది.

రావుగారు చాలా మృదువుగా, "నిజం చెప్పమంటావా అమ్మా. నాకు ఈ సంబంధం ఇష్టం లేదు ఈ ఆలోచన మీ అమ్మది. నా కా అబ్బాయి ఎందుకో నచ్చలేదు."

ఇందిర విస్మితురాలై, తల పైకెత్తి, "ఎందుకు నాన్నా?" అంది.

"కారణం నాకు తెలీదమ్మా. కాని, నీ భావి జీవితంలో సుఖపడటమే నాకు కావలసింది. నీకు అతను నచ్చితే నేనేమీ కాదనను. కాని, అతన్ని చేసుకోమని నేను చెప్పను."

"అంతా నాకే వదిలిపెడితే ఎలా నాన్నా? నువ్వేమంటావ్?"

రావుగారు నవ్వి, "అతనిముందు నువ్వే చాలా మంచిదానివమ్మా."

"పాపం ఆ అబ్బాయి మీ నెత్తిమీద రాయి వేశాడా ఏం?" అన్నారు లలితమ్మగారు.

"అలా కాదు అతన్నిగురించిన నా అభిప్రాయానికి కారణమేమీ లేదు. కొందరంటే మొదటి చూపులోనే ఇష్టపడతాం. కొందరంటే అది ఉండదు. దానికి కారణం కూడా ఏమీ ఉండదు"

"అబ్బాయి మన్మధునిలా ఉన్నాడు."

"ఒప్పుకున్నా"

"విద్యావంతుడు."

"కాదనలేదే"

"మరి మీరెందుకు ఒప్పుకోకూడదు?"

"పెళ్ళి చేసుకొనేది నేనుకాదు ఇందిర తనకు నచ్చితే నా అభ్యంతరం ఏమీ లేదు"

ఇందిర అసహాయురాలై తల్లివేపు చూసింది. కూతురి బదులు తల్లి బదులు చెప్పింది.

"నిదానంగా ఆలోచించి చెప్పు."

# వెండిమబ్బు

ఇందిర బరువుగా అడుగులువేస్తూ వెళ్ళి పోయింది.

మర్నాడు సంతోషంగా లలితమ్మగారు రావుగారిదగ్గరకు వెళ్ళి, "ఇందిర ఒప్పుకుంది" అన్నారు.

"నువ్వేం పొరపాటు పడలేదుకదా?" అన్నారు రావుగారు సంశయదృష్టితో చూస్తూ.

"ఇంకా నయం. ఇందిరకు ఆ మాత్రం తెలియదా?"

"నిండు యౌవనం, సుందరరూపంచూసి ముగ్ధురాలయ్యే వయస్సు తనది. ఇందిర నిలా విలు."

లలితమ్మగారి కేకతో ఇందిర వచ్చింది. ఇందిర ముఖంలో ఆనందరేఖలు లాస్యమాడుతున్నాయి.

"అబ్బాయిని ఒప్పుకొన్నావమ్మా?"

"ఊఁ"

"తొందరపడి ఒప్పుకొని, తరువాత పశ్చాత్తాప పడవుగదా?"

"లేదు" ఇందిరస్వరం సుదృఢంగా ఉంది.

రావుగారు కూతురి మొహం చూసి సంతృప్తు లయ్యారు. ఆమె ముఖభావం తన ఎన్నికలో పూర్తి భరోసా, తృప్తి కలిగినట్లుంది.

లలితమ్మగారి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. ఆత్రంగా, "ఉత్తరంవ్రాసి వాళ్ళ అభిప్రాయం కనుక్కొంటారా?" అన్నారు.

"ఉహూఁ. నేను వ్రాయను."

లలితమ్మగారు క్రుంగిపోయారు. కోపంగా,

"ఇంక పరిహాసం చాలు" అన్నారు.

"పరిహాసం కాదే. నేనే రేప బెంగుళూరులో కారులో మైసూరు వెడతాను. అతడు ఒప్పుకొంటె అతని తల్లిదండ్రుల్ని తీసుకొని వస్తాను. వీలైతే మోహనుడిని కూడా..............." రావుగారు కూతురి వైపు తిరిగారు.

కాని ఇందిర అక్కడలేదు. అప్పుడే వంటింట్లోకి పారిపోయింది.

*   *   *

మైసూరునుండి వచ్చిన టెలిగ్రాం చేతిలో పట్టుకొని రావుగారు వెళ్ళినపని సానుకూలమయి ఉంటుందనుకొన్నారు లలితమ్మగారు.

"ఇందిరా!"

ఇందిర తోటంతా తిరిగివచ్చి, ఆయాసంతో సోఫాలో విశ్రమించింది. "మీ నాన్నగారు టెలిగ్రాం ఇచ్చారు మైసూరునుండి."

ఇందిర ముఖంలో ఏభావాన్నీ కనపడనీకుండా అలాగే టెలిగ్రాం అందుకొని కవరు చింపి చదివింది.

"ఏం రాశారు?" లలితమ్మగారు ఆత్రంగా అడిగారు.

"రేపు అందర్నీ తీసుకొని వస్తారట."

"అయితే వెళ్ళినపని పండయిందన్నమాటే. నువ్వు పుణ్యం చేసుకొన్నావులే. మన్మధుడిలాంటి భర్త."

"ఇహ ఊరుకోమ్మా!" అంది ఇందిర చిరుకోపంతో.

"అపుడే ఎంత గర్వం. తన భర్తే అందగాడు కదా అని."

"భర్తయిన కాలానికి చూద్దాములే!" అంది ఇందిర.

"ఛ. ఎందుకలా అంటావు. ఈరోజు కాకపోతే రేపు అతడు నీ భర్తే."

ఈ వార్త ఇందిర నెంతో సంతోషపర్చింది. ఆనందతరంగాలు ఆమె హృదయసరోవరంనుండి పొంగిపొంగి ముఖంమీదకు రావటానికి ప్రయత్నిస్తూఉన్నాయ్. ఎప్పుడూ గంభీరంగానేఉండే ఇందిర మొహం అప్రయత్నంగానే కొంచెం వికసించింది. హృదయంలోని ప్రఫుల్లతను మోహంమీదికి రాకుండా నిరోధించడానికి ప్రయత్నించింది ఇందిర. కాని, తన ప్రయత్నంలో సఫలురాలు కాలేకపోయింది.

తల్లికి కూతురి ముఖభావాలను గమనిస్తూ నిల్చునేంతతీరికలేదు. ఆమె, "పుట్టయ్యా" అంటూ పిలుస్తూ, వెలుపలికి వెళ్ళారు. ఒక్కతే కూతురు. ఆకూతురి పెళ్ళి గురించి కలలుకంటూఉంది.

---

**సన్యాసి :** ఇంత అన్నం పెట్టించండి బాబు! మూడు రోజుల నుంచి తిండిలేక చస్తున్నాను. ఆఖరికి పాపం తలచిన వారుకూడా లేరు.

**అధికారి :** అదృష్టవంతుడివి. నేను మూడుచోట్ల విందులకు వెళ్ళి, ముప్పైమంది అభినందన ఉపన్యాసాలు వినవలసి వచ్చింది!

డి. మూర్తి (మదరాసు)

---

ఆకలలు నిజమయ్యేసరికి ఆమె సంతోషానికి పట్టపగ్గాలులేవు. ఇంకొక్షణంలో ఆమె సంతోషం ఇంటినిండా వ్యాపించిపోయింది.

ఇందిర కాస్సేపు టెలిగ్రాం చూస్తూకూర్చుంది. తరువాత టెలిగ్రాం మడిచి టేబిల్‌పీద పెట్టి లేచి నిల్చుంది. లలితమ్మగారు లోపలకువచ్చి,

"మళ్ళీ తోటకు వెడుతున్నావా?" అన్నారు.

"లేదమ్మా. ఎందుకో నిద్ర వస్తోంది. పడుకుంటాను."

కూతురి తీరు ఆమెకు కాస్త కోపం తెప్పించింది. కాని, దాన్నే పెద్దదిగా చేస్తూ, కూర్చోక హడావిడిగా తన పనుల్లో మునిగిపోయిందామె.

*   *   *

కారు ఇంటిముందు ఆగగానే ఇందిరతప్ప మిగిలినవాళ్ళంతా బయటకువచ్చి నిల్చున్నారు. పుట్టయ్య సంతోషంతో,

"మోహన్‌రావుగారు మళ్ళీ వచ్చారమ్మా ఇందిరమ్మను చూడటానికి" అన్నాడు తన ఎర్రటి పళ్ళు బయటపెడుతూ.

మోహనుడితల్లి గౌరమ్మగారి మొహం కనబడేసరికి లలితమ్మగారు కారుదగ్గరకువెళ్ళి సగౌరవంగా,

"రండి" అంటూ ఆహ్వానించారు.

మోహనుడు మొదటిసారి "మెరుపుతార"కు అపరిచితుడుగా వచ్చాడు. కాని, ఈసారి కాబోయే అల్లుడు. పుట్టయ్య మొదటి ఆదరభావంతోబాటు, గౌరవాన్ని కూడా కలిపి మోహనుడిని పలకరించాడు. వాళ్ళతోబాటు మోహనుడితండ్రి సుబ్బయ్యగారు, చెల్లెలు కమల వచ్చారు.

సుబ్బయ్యగారికి రావుగారి ఆదర సత్కారాల వైపు అంత గమనంలేదు. ఆయన మనస్సంతా రావుగారి భవనం, కాఫీతోటలవైపు ప్రసరించి, "ఈయన ఆస్తి మొత్తం ఎంత ఉంటుంది" అని అంచనావేస్తూ ఉంది.

గౌరమ్మగారికేమో పిల్లను చూడాలనే కుతూహలం అపరిమితంగా ఉంది. కారణం మోహనుడు సామాన్యమైన పిల్లను ఒప్పుకోడని తెలుసు. ఎంతో అందమైన పిల్లలనుకూడా ఏదో వంకపెట్టి నిరాకరించినవాడు. ఇప్పుడు ఏమీ మాట్లాడకుండా ఒప్పుకొన్నాడంటే అమ్మాయి అప్సరసఅయిఉంటుంది అనుకుంది ఆమె.

కాఫీ—ఉపాహారాల అనంతరం ఇందిర కనిపించింది. ఇందిర ఏ విధమైన ఆడంబరమూ లేకుండా మామూలు దుస్తుల్లోనేఉంది. కూతురి అలంకారం విషయంలో తల్లి తనశక్తినంతా ఉపయోగించినా కూడా ఓడిపోయింది. తల్లి పట్టుదలను ఏమాత్రం నెగ్గనివ్వకుండా ఇందిర మామూలు లేత ఎరుపురంగు నూలుచీర కట్టుకుని, దానికి నప్పే ఎర్రచుక్కల చేనేత జాకెట్ వేసుకొన్నది.

"నా అసలురూపం వారికి కనబడకుండా ఉండటం నా కిష్టంలేదు" అంటూ పౌడర్‌కూడా ముట్టుకోలా.

ఆరోగ్యం, యువ్వనాల నిండుదనంతో ఇందిర గౌరమ్మగారికంటికి ఇంపుగా కనిపించినా "పిల్ల అందగత్తెకాదు" అన్న విషయం మొదటిచూపు లోనే గ్రహించా రావిడ.

మాలతి, కుముదిని లాంటి సౌందర్యవతులను కాదన్న మోహనుడు ఏం అందంచూసి ఈ పిల్లను ఒప్పుకున్నాడో ఆమెకు అర్థంకాలా.

ఇందిర పెళ్ళిచూపులకు లోనైన, ఇతర అమ్మాయిల్లాగ ఏం సిగ్గుపడలేదు. పరిచితులతో మాట్లాడినట్లే వర్తించింది. ఇందిర మాటల్లో ఏమాత్రం సంకోచం లేకపోవటంచూసి "గడుసుపిల్ల" అనుకున్నారు గౌరమ్మగారు.

కొడుకు ఒప్పుకొన్న పిల్లను తాను ఒద్దనుటలో అర్థంలేదని ఆమెకు తెలుసు. సుబ్బయ్యగారికి పిల్ల అందంవిషయం అనవసరం. ఆ పిల్లను కోడలిగా తెచ్చుకోవటంవల్ల తమకు ఎంతమాత్రం లాభముందన్న సంగతే ఆయనకు ముఖ్యం. మైసూరు లోనే ఇద్దరి జాతకాలు ఇంతకుముందే చూపించారు. జ్యోతిష్కులు ఇద్దరి జాతకాలు పరిశీలించి, "ఈ అబ్బాయికోసమే ఈ అమ్మాయి పుట్టింద"ని కచ్చితంగా చెప్పారు.

మోహనుడిని రావుగారు తమ స్వంతడబ్బుతో అమెరికాకు పంపటానికి ఒప్పుకున్నారు. పెళ్ళిచేసి పంపడమా, చదువయ్యాక పెళ్ళిచేయడమా అన్నదే నిర్ధారణ కాలేదు.

రావుగారికి, లలితమ్మగారికి మాత్రం పెళ్ళి చేశాకనే పంపాలని ఉంది. సుబ్బయ్య, గౌరమ్మగార్లు "అంతా అబ్బాయి ఇష్టం" అని ఊరుకున్నారు.

చెప్పాలో తెలియలేదు.

రెండుసార్లు ఇందిరవైపు చూశాడు. కాని ఆమె మొహంలో ఏ భావాన్ని కనిపెట్టలేకపోయాడు. మోహనుడు తనవైపు చూస్తూఉంటే, ఇందిర కమలతో మాట్లాడుతూఉంది.

"ఏమంటారు మోహన్‌రావ్? మాకు పెళ్ళిచేసి పంపించాలనేఉంది. కాని మీకు ఏవిధంగాను అననుకూలం కాకూడదు. ఆలోచించి చెప్పండి" అన్నారు రావుగారు.

ఆఖరికి మోహనుడు ధైర్యం తెచ్చుకుని, "ఇందిరతో మాట్లాడి ఏ సంగతీ చెప్తాను" అన్నాడు.

మోహనుడి నోటివెంట తనపేరు విని ఇందిర మొహం సిగ్గుతో ఎరుపెక్కింది. పెళ్ళికాకపోయినా తామిద్దరూ, దగ్గరవాళ్ళులా అనిపించింది. అతడి జీవితంలో తన పాత్ర ఎంత మహత్వముయింది అని ఆశ్చర్యం వేసింది. ఇకమీదట అతను ఏమి చెయ్యాలన్నా తనతో సంప్రదించాలి! ఎంత విచిత్రం! ఒకవిధమైన భావనలతో ఆ బాలిక హృదయం ఒక విధంగా సంతసించింది.

పుట్టయ్య నవ్వుతూ, "చిన్నమ్మగారి హుకుం లేందే చిన్నబాబుగారు ఏమి చెయ్యటానికి వీల్లేదు" అని పరిహాసం చేశాడు.

భోజనాలయ్యాక అందరూ విశ్రాంతి తీసుకొన్నారు. సాయంకాలమవుతూఉండగా మోహనుడు ఇందిరతో తోటవైపు బయల్దేరాడు. పెద్దలు ఇంటిగుమ్మంలో నిల్చుని వెడుతున్న పెళ్ళికానిజంటని చూస్తున్నారు.

తోటలో తిరిగిరావటానికని వెళ్ళటమనేది కేవలం నెపమే.ఇందిర సలహా తీసుకోవటమే ఆ వాహ్యాళి ఉద్దేశ్యం. ఒక గదిలో కూర్చుని ఏదో వ్యవహారం మాట్లాడినట్టుగా మాట్లాడటంకన్నా సాయంకాలం చల్లటిగాలిలో నడుస్తూ, ఇందిర సలహా తీసుకోవా లనిపించింది మోహనుడికి. అతడు నిర్భయంగా రావుగారివద్ద తన కోరిక వెలిబుచ్చాడు. ఆయన మొదట ఆశ్చర్యపడ్డారు. తరువాత చిరునవ్వు నవ్వి, "సరే" అన్నారు. లలితమ్మగారికి అల్లుడి మందరరూపంతప్ప మరేమీ కనిపించటంలా. ఆమె కూతురితో,

"ఇందిరా, మోహన్ నీతో తోటలో షికారుకు వెళ్ళాలనుకొంటున్నారు" అన్నారు.

"ఇదేం తొలిసారి కాదుగా. రెండవసారి."

"అప్పుడు పుట్టయ్య ఉన్నారు!" లలితమ్మగారు కూతుర్ని ఏడిపించాలని అన్నారు.

"ఇప్పుడూ రానీ ఎవరొద్దన్నారు?" అన్నది ఇందిర.

సాయంత్రంమట్టుకు ఇందిరకు తల్లిమాట వినక తప్పలేదు. తల్లి తీసిఇచ్చిన లేతపసుపురంగుకు, ఆకుపచ్చని బార్డరుకల చీర కట్టుకొని, పచ్చటి జాకెట్ వేసుకుంది. వెడుతున్న ఇందిరకు తల్లి బలవంతంగా ముత్యాల జూకాలు వేసింది. ఇందిర మామూలుగా కత్తి పుచ్చుకొంది. ఇది చూసి, మోహనుడు నవ్వి,

"నేను కూడా ఒక కత్తి తీసుకోనా?" అన్నాడు.

పుట్టయ్య నవ్వాపుకోలేకపోయాడు. ఇందిర మొహం తిప్పుకుని నవ్వుకొంది.

"చిన్నబాబుగారు దిబ్బలు ఎక్కి దిగేటప్పుడు జాగ్రత్తగా చూసుకోవాలి అమ్మాయిగారూ" అన్నాడు పుట్టయ్య.

పచ్చని చెట్లమధ్య ఇందిరా మోహనులు కనుమరుగయ్యారు.

ఇందిర మాట్లాడకుండా కాఫీచెట్ల అక్కరలేని కొమ్మలను నరుకుతూ నడుస్తోంది. మొదటిసారి అతిథిగా వచ్చినవ్యక్తి ఈనాడు తన భావిపతి. మోహనుడు చాలాసేపు మాట్లాడకుండానే నడిచాడు. ఎగుడుదిగుడుగాఉన్న ఆ కొండప్రదేశంలో నడక అలవాటులేక మోహన్ అప్పుడప్పుడూ జారేవాడు. ఒకసారి జారిపడబోయిన మోహన్ ఇందిర భుజం గట్టిగా పట్టుకొని నిలబడ్డాడు. మోహన్‌భుజం పట్టుకొని, తనవైపుకు కొంచెం లాగగానే ఇందిర ఒకచేతితో అతడు నిలబడటానికి సాయంచేసింది. స్థిరంగా నిల్చున్నాక కూడా మోహన్ ఇందిరచేతిని వదలలేదు.

---

"మరేం దిగులుపడకు! నీ తరఫున నేను వాదిస్తాలే. ఇంతకూ ఖర్చులకు డబ్బేమైనా ఉందా?" న్యాయవాది నిందితుణ్ణిఅడిగాడు.

"ఏదో లెండి! ఒక కారుఉంది"

"భేష్! ఇహ కేసువివరాలు చెప్పు. నీమీద వచ్చిన ఆరోపణ ఏమిటి?"

"కారు దొంగిలించానని"

ఆర్. రజనీకాంత్ (విజయవాడ)

---

ఇందిర పెదవి కొరుక్కుంటూ దగ్గరగాఉన్న చెట్టు నానుకొని నిలబడింది. మోహనుని స్పర్శతో దేహమంతా పులకరించింది. మోహనుడు ఇందిరను దగ్గరకు లాక్కున్నాడు. ఇందిర తలెత్తి అతనివైపు చూసింది. మోహనుడికి అది కొరడాదెబ్బలా తగిలింది. వెంటనే ఇందిరచేతిని వదిలేశాడు.

ఇందిరకు నిరాశయింది. ఆమెకళ్ళు అతని కళ్ళతో కలుసుకోగానే మోహన్ తప్పుచేసినవాడిలా చేయి వదిలేశాడు. ఎందుకు? విశాలమైన అతని వక్షస్థలంలో సిగ్గుతో ఎర్రబారిన తన మొహాన్ని దాచుకోవాలని, ఉత్కటమైన కోరిక కల్గింది ఇందిరకు. తను అతడిని చూచినపుడు ఇంకోవిధంగా భావించారా? తను నిందాదృష్టితో చూడలేదే? తన హృదయంలోని ప్రేమనంతా అర్పిస్తూ చూసింది. కాని, ఇలా జరిగిందేమిటి?

ఇందిర ముందుకు అడుగువేసింది.

"ఇంకా పైకి వెడదామా?" మోహన్ అడిగాడు.

"మీ ఇష్టం"

"అయితే పద"

"కాని మీరు జాగ్రత్తగా నడవాలి"

"నేను జారితే పట్టుకోడానికి నువ్వున్నావుగా!"

"మీరు నా చెయ్యి పట్టుకొని లాగితే నేనూ పడతాను."

మోహనుడు నవ్వాడు. ఇందిర మెల్లగా చెట్లను తప్పించుకొంటూ ముందుకు నడిచింది. మోహనుడు అనుసరించాడు.

పెద్ద టానుగచెట్టుకిందికి రాగానే, "ఇక్కడే కూర్చుందామా?" అన్నాడు మోహనుడు.

"ఊఁ"

ఇందిర అక్కడే ఒక రాతిమీద కూర్చుంది. మోహనుడు కొంచెం దూరంలో కూర్చున్నాడు. మోహనుడు సూటిగా ప్రశ్నించాడు.

"నీ అభిప్రాయం ఏమిటి?"

"ఏ విషయం అడుగుతున్నారు?"

"అదే నేను వెళ్ళేవిషయం."

"మీ అభిప్రాయం ఏమిటి?"

"పెళ్ళికాకుండా ఒకర్నొకరు విడిచిఉండటం లేరిక. కాని పెళ్ళి చేసుకొని విడచివెళ్ళటం కష్టమనిపిస్తుంది. నేను చదువు పూర్తిచేసుకుని వచ్చాకనే పెళ్ళి చేసుకోవటం మంచిది" ఇందిర మాట్లాడలేదు. మోహనుడు ఒక్కనిమిషం ఊరుకొని,

"పెళ్ళయ్యాక మనస్సు చదువులో నిలవడం కష్టం" అన్నాడు.

ఇందిర కత్తితో నేలమీదగీస్తూ, "అయితే అక్కడనుంచి వచ్చాక పెళ్ళిచేసుకోవటమే మంచిదంటారా?"

"ఊఁ"

"కాని, దానికి నేను ఒప్పుకోకపోతే?" ఇందిర అడిగింది.

"పెళ్ళి చేసుకునే వెడతాను. నా పై చదువుకు పెళ్ళి ఏ విధంగాను అడ్డు కాకూడదనే ఇలా చెప్తున్నాను."

"అవును. పెళ్ళి మీ చదువుకు అడ్డు కాకూడదు" ఇందిర నెమ్మదిగా అంది.

"అయితే......అయితే......అక్కడనుంచి వచ్చాక పెళ్ళి చేసుకోవటం నీ కిష్టమేనా ఇందిరా?"

"ఊఁ"

"తరువాత నేను వంచించనని తెలుసుగా. లేక నాపై సంశయముందా?"

"ఎందుకిలా అంటారు?"

ఇందిర కంఠంలోని బాధను గుర్తించి మోహనుడు, "పొరపాటు క్షమించు" అన్నాడు.

"మిమ్మల్ని నావారని నా మనస్సు ఒప్పుకొన్నప్పటినుండి మీపై నాకేవిధమైన సంశయమూ లేదు"

ఇందిర నొచ్చుకుందని తెలుస్తూనేఉంది.

మోహనుడు ఇందిరదగ్గరకు వచ్చి, నిల్చుని, "పొరపాటన్నానుగా ఇక బాధపడకు" అన్నాడు.

"మీమీద అంత నమ్మకం లేకపోతే పెళ్ళి చేసుకునే పంపేదాన్ని. పెళ్ళి చేసుకొని వెళ్ళినంతమాత్రాన మీకు నామీద మనసు లేకపోతే వేరేవిధంగా ప్రవర్తించకూడదా?"

మోహనుడు ఇందిర కాళ్ళదగ్గర కూర్చున్నాడు. "నీ మనస్సుకు ఇంత నొప్పి కలుగుతుందని తెలిస్తే అలా అనేవాడినేకాదు."

ఇందిర బదులు చెప్పనేలేదు.

మోహనుడు, "ఏ శిక్షయినా విధించు అనుభవిస్తాను. కావాలంటే నీ కత్తితో రెండు దెబ్బలు వేసినాసరే!" అన్నాడు.

ఇందిర చిరుకోపాన్ని నటిస్తూ, నోటిమీద వేలుంచుకుని, "ఇక చాలు" అంది.

# వెండి మబ్బు

"నేనొక్కమాట అడగనా?" అన్నాడు మోహనుడు.

"అడగండి"

"మాటగా బదులు చెప్తావా?"

"ఆఁ"

"నావైపు చూస్తూనే చెప్పాలి."

"అలాగే"

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?"

అంతవరకు అతనివైపే చూస్తున్న ఇందిర టక్కున తల వంచేసింది.

"చెప్పవా?"

"లేదు. చెప్తాను"

"చెప్పుమరి"

ఇందిర తల పైకెత్తింది. మళ్ళీ వెంటనే రెండు చేతులతోనూ మొహాన్ని కప్పేసుకుంది. "నేను చెప్పలేను బాబూ, నాచాతకాదు" అంటూ, ఇందిర రెండుక్షణాలు అలాగే ఉంది. తరువాత నెమ్మదిగా తల పైకెత్తి మోహనునివైపు చూస్తూ, "నే నొక్క మాట అడగనా?" అంది.

"ఆహా!"

"మీరు నన్ను........"

"ఊఁ. అడుగు మరి"

"పోండి నే నడగను."

"పోనీలే. నీకే బదులు దొరకదు నాకేం" అన్నాడు మోహన్ చిలిపిగా.

ఇందిర సిగ్గుతో తలవంచుకుని, "నేనేం అడగా లనుకుంటున్నానో మీకు తెలుసు. జవాబు చెప్పండి" అంది.

"చెప్పితీరాలా?"

"ఊఁ!"

"నిజంగా చెప్పనా?"

"చెప్పండి"

"తరువాత ఎందుకడిగానా అని బాధపడవుగా!"

ఊహుఁ"

వెంటనే మోహనుడు ఇందిరను రాతిమీదనుండి క్రిందికిలాగి అరుణరాగంతో ప్రజ్వలిస్తున్న ఆమె ముఖాన్ని చుంబించి, "ఇదే నా జవాబు" అన్నాడు.

ఇందిరకు ఒక్కక్షణం మైకం క్రమ్మినట్టయింది. ఆమె కళ్ళు మూసుకుని, హృదయంవిప్పి మోహనుని చెవిలో, "ఓ నా స్వామీ! నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. ఎంతగానో చెప్పలేను" అంది.

సూర్యుడు అస్తమించాడు. నలువైపులా సంజ చీకట్లు ముసరుకొంటున్నాయి. తన్మయత్వంతో తన మొహాన్నే చూస్తున్న ఇందిరను మోహనుడు మేల్కొలిపి, "ఇక వెడదామా? చీకటి పడుతోంది" అన్నాడు.

ఇందిర లేచి నిల్చుంది. ఇద్దరూ బయల్దేరారు. మోహనుడు, "నాకోసం నువ్వు రెండేళ్ళు కాచుకోవాలిగదా ఇందిరా!" అన్నాడు.

"మీరూ అంతేగా. ఇప్పుడు మనకోసం వాళ్ళంతా కాచుకొని ఉంటారు. పదండి" అంటూ గబగబా అడుగులు వేసింది. కొంతదూరం నడవగానే పుట్టయ్య చేతిలో టార్చిలైటుతో కనిపించాడు.

"మిమ్మల్ని తపస్సునుండి లేపడానికి వస్తున్నాను" అన్నాడు పుట్టయ్య.

"అలాగా, పూలబాణాలకు బదులుగా టార్చిలైటుధరించారన్నమాట" మోహన్ నవ్వుతూ అన్నాడు.

"చీకటవతుంది. రావుగారు చూసిరమ్మని పంపితే వచ్చాను. అసలే అమ్మాయిగారికి తోటలోకి వెడితే బయటకు రావాలన్న ధ్యాసే ఉండదు. పైగా ఈరోజు మీరు కూడా ఉన్నారాయె......."

ఎప్పటిలా ఇందిర చిలిపిగా మాట్లాడలేదు. ఆమెముఖంలో నిండుకున్న గాంభీర్యాన్ని కదిలించడం పుట్టయ్యవల్ల కాలేదు. మోహనుడుమాత్రం తేలికపడ్డ హృదయంతో నవ్వుతూ మాట్లాడుతూ నడుస్తున్నాడు.

రాత్రి భోజనానంతరం మోహనుడు తన అభిప్రాయాన్ని రావుగారితో చెప్పాడు. ఇందిర ఒకే మాట చెప్పింది.

"పెళ్ళివల్ల వారి చదువుకు విఘ్నం కలగకూడదు"

ఇందిరనిశ్చయం అందరికీ నచ్చింది. లలితమ్మగారికిమాత్రం కూతురిపెళ్ళి చేసెయ్యాలని తొందరగా ఉంది.

అందరూ పడుకున్నాక, లలితమ్మ ఇందిరతో "నువ్వు పెళ్ళి చేసుకొనే వెళ్ళమంటే అతను కాదనడు. ఇంకా మించిపోలేదు" అన్నారు.

"నావల్ల వారికి కష్టం కలక్కూడదు."

"కష్టమేముంది? అత నక్కడుంటాడు. నువ్విక్కడుంటావు."

"మీ ఆవిడ ఎక్కడికెళ్లారు?" విరాళంకోసం వచ్చిన మహిళా సంఘం సభ్యురాలు ఆ ఇంటి యజమాని నడిగింది.

"స్మశానానికి"

"ఎప్పుడు వస్తారు."

"ఏమో చెప్పలేం. వెళ్లి పదేళ్ళయింది మరి!"

"కాని, మనస్సు అటువేపే లాగుతుంది కదమ్మా. పెళ్ళయితే ఈ ఆకర్షణ మరింత ఎక్కువ."

"ఒకవేళ ఆ తరువాత అతను......" లలితమ్మగారు సంశయంతో కూతురిమొహం చూశారు.

"అమ్మా, నాకు ఆయనలో పూర్తి నమ్మకం ఉంది. ఈవిధంగా మాట్లాడి నన్ను నొప్పించవద్దు."

తల్లి ఇక మాట్లాడలేదు. ఆమె ఆశ్చర్యంతో ఇందిరను చూశారు. అంతదాకా స్వకీయురాలైన పిల్ల ఇంతలోనే పరకీయురాలైపోయింది. పద్దెనిమిదేళ్ళనుండీ తాము ధారపోసిన మమత, స్నేహం, విశ్వాసం, ప్రేమ అన్నిటినీ ఆ అపరిచితయువకుడు ఒకేరోజులో అపహరించి కూతురిని పూర్తి నిర్గతికురాలినిగా చేసివేశాడని తల్లి గ్రహించింది.

"మేము ఇంత త్వరగా పరాయివాళ్ళమైపోయామా!" అన్న ఆశ్చర్యంలో కొంచెం మాత్సర్యం కూడా లేకపోలేదు. కాని వెంటనే,

"అది కూడా సహజమే. రెక్కలొచ్చిన పక్షి సహచరునితో ఎగిరిపోవడానికి సిద్ధంగా ఉంది" అనుకుని మనస్సును సమాధానపరచుకొన్నారు.

"నన్ను నొప్పించవద్దు" అన్న ఇందిర మాటలకు ఆమె విశేషార్థాన్ని కల్పించుకుని నవ్వుకున్నారు. నవ్వుతూనే,

"ఇప్పుడే ఇలా అయితే ఇక ముందు ముందెలా?" అన్నారు.

"ఎలాంటి?"

"రెండేళ్ళు భర్తను వదలి ఉండాలిగా?"

"ఇప్పట్నుంచి ఆ యోచన ఎందుకమ్మా?"

"పెళ్ళి చేసుకొని అతనితో నువ్వూ వెళ్ళవచ్చు" తల్లి సలహా ఇచ్చింది.

"వీల్లేదమ్మా. నేను వెడితే చదువు సాగదు. తిరిగొచ్చాకనే పెళ్ళి. ఆ సంగతి నిశ్చయం అయిపోయింది."

అక్కడితో ఆ సంగతి ఇత్యర్థమయిపోయింది.

మర్నాడు రావుగారు హోటల్లో పెద్దగా విందు ఏర్పాటుచేశారు. చుట్టుప్రక్కల కాఫీ, ఏలకుల తోటల యజమానులను, స్నేహితులను అందరినీ ఆహ్వానించారు. అతిథిసత్కారంలో మోహనుడిదే ప్రముఖపాత్ర. రావుగారు వచ్చినవారందరకూ మోహనుడిని పరిచయం చేస్తున్నారు.

"మోహన్‌రావ్ త్వరలో మా అల్లుడు కాబోతున్నారు."

అందరూ మోహన్, ఇందిరలను అభినందించారు. సుబ్బయ్య, గౌరమ్మగార్లు కొడుకుకు పట్టిన అదృష్టానికి పొంగిపోయారు. అందులోనూ గౌరమ్మగారు ఇందిర పెట్టుకొన్న అమూల్యమైన ఆభరణాలు చూసి, ఆనందంతో,

"లక్ష్మిలా ఉన్నావు తల్లీ. కాని ఈ అడవిలో ఇన్ని నగలు పెట్టుకొంటే అపాయమేమీలేదా?"

"మాదగ్గర రెండు రివాల్వర్లు ఉన్నాయి. రాత్రిపూట నాన్నగారు తలగడక్రింద రివాల్వర్ ఉంచుకొనే పడుకొంటారు."

"ఆయన ఊళ్లో లేనప్పుడు?"

"పుట్టయ్య ఉంటారు. నాకు గురి తెలుసు. ఇక్కడ భయమేలేదు" అంది ఇందిర. రావుగారి స్నేహితులు మోహనుడిని అభినందిస్తూ, "పప్పన్నంకోసం మేమింకా ఎంతకాలం కాచుకోవాలి?" అన్నారు.

"అమెరికాలో ఎన్నేళ్ళుంటారు?" అన్నారు మరొకరు.

"రెండు సంవత్సరాలు" అని జవాబిచ్చారు రావుగారు.

"అయితే పప్పన్నంకోసం మేమింకా రెండేళ్ళు వేచిఉండాలన్నమాట!" అని సాగదీశారొకరు.

"మనమాట అటుంచండి. ఇందిర రెండేళ్ళు వేచి ఉండాలిగా" అన్నారు మరొకరు.

"నా సంగతో" నవ్వుతూ అడిగాడు మోహన్.

రావుగారి మిత్రు లొకరు నవ్వుతూ,

"ఇందిరకు అనిపించినంత కష్టం నీకు అనిపించదు. ఎందుకంటే అమెరికా నీకు క్రొత్తచోటు, క్రొత్తదేశం, క్రొత్తమిత్రులు. వీటిమధ్య నీకు ప్రొద్దు ఎలా గడచిపోతుందో కూడా తెలీదు. కాని ఇందిరకుమాత్రం నువ్వు వచ్చేదాకా నీ ధ్యాసే" అన్నారు.

దగ్గర్లో నిల్చున్న ఇందిర నవ్వి,

"మీదంతా అతిశయంగాఉంది మామయ్యా!" అంది. ఇందిరను ఉడికించడానికి మోహనుడు,

"నేను అమెరికాలో ఉంటేమాత్రమేం? "వెండి మబ్బు"లో విహరించే తార ఇందిర అని పుట్టయ్య ఆనాడే చెప్పారు" అన్నాడు.

"మోహన్‌రావ్, ఇలారండి" అన్న రావుగారి పిలుపుతో మోహన్ అటువైపు వెళ్ళాడు. (సశేషం)



"కలిమిలేములు"లో ప్రభాకర రెడ్డి.



నటశేఖరి జాలి "కలిమిలేములు"లో (కు, కృష్ణ) కుమారి.

# దేశవాళీ బయస్కోపులు

13 వ పేజీ తరువాయి

రెండోవాడు (హాస్య నటుడు) కవి (తెనుగుదేశం మహాకవుల పుట్టినిల్లు కావాలంటే దిన పత్రికలు చదువుతూ ఉండండి. ఏదో మామూలు 'మహాకవు'లుంటారు) రాసే మాటల్లో కొత్తగా విట్ లేదూ నేనే చెప్తాను 'హిట్' ఐపోతుంది అంటాడు. సదరు షరుత్తులతో సినిమా తీయగా అది అరవ వాణీలో, బెంగాలీ సరళిలో, హిందీ గానంలో, తెనుగుదేశంలో స్వైరవిహారం చేయగా— అదీ వైరైటీ అంటే. 'ఇక ఛేంజ్'; (హిట్మాత్రం మరువరాదు. ఏమనగా ప్రేక్షకులకు సినిమా అలవాటు. ఏది తీసినా చూస్తారు!) పై షరుత్తుల కంగీకరించి కమేడియను డైలాగులను కవి విదుకుండుటూ .... విలన్ ఎన్ని ఘోర అపచారములు చేసినా ప్రేక్షకుల సింపతీకి అభర్ని విరమరణం పొందడం హీరో వాన్న హీరోయిన్ అమ్మా లెంపలు వేసుకోడం (ఇలాంటివాళ్లను కన్నామెందుకని కాబోలు) ఇదీ ఛేంజ్. ఓ సినిమాలో 'హీరో' హీరోయిన్ "ఛేంజ్" చేస్తే (పబ్లిక్ పార్కులెందు కనుకున్నారు) మరో బొమ్మలో హీరోయిన్ని వెంటాడతాడు ("ప్రావెక్కులు" దాక్కులూ ఎందు కనుకున్నారు ?) కాని ఇంతా చదివాకా, ఇదంతా ఒప్పుకున్నాకా, శైలాముణ్ణా కథకీ, ద్రౌపదీ వస్త్రాపహరణం కథకీ, 'ఇంట' కోసారీ, సీజన్కోసారీ సినిమా అయ్యే అర్హత ఉన్నదని ఆమోదించాకా, అసలు సదరు మాత్రం ఔటాఫ్ డేట్పోయింది. నుడికారం మారిపోయింది. ఎందుకు మారదేం ? (పెసరపప్పు బజార్లో లీటర్లలోను బట్టలు మీటర్లలోను అమ్ముతున్నారుగా) ఇది యిలా ఉంచండి : ఆమధ్య ఓ కథ జరిగింది. 'సినీమార్కుడి' బుర్రలో ఉదయించిం దా తర్వాత దాని ఇన్స్పిరేషనే కూడాను! అనగనగా ఓ తెనుగు మీరిన దొంగాడు (హాలీవుడ్ లోనూ, అరేబియాలోను, తెనుగు సినిమాలోను సగం హీరోలు పూర్వం రాజులై అనక దొంగలైన అద్భుతమ్మైన దొంగలే కావాలంటే చూడండి అరవ సినిమాలు) నాలుగు సైకిళ్లను నాలుగు దుకాణాల్లో నాలుగు వేర్వేరు సమయాల్లో తస్కరించాడు. (ఇదే "షివ్రలీ" అంటే అసలు నాయక కోరే నాయకుడి లక్షణాల లక్ష్లో ఇది ఒకటి) ఆతర్వాత నాలుగు సైకిళ్లనూ ఏకీలు కాకీలు, ఏ కాలు కా, 'కాలు' (అనగా చక్రాలు) ఊడపెరికే కాడు. అన్నీ కలిపేశాడు. (సమైక్యతా మాత్రంలో మరాఠీ, భాషల్నీ, సంస్కృతినీ ఇలా కలిపేయాలనీ యింకా గ్రంథస్తం చేయని, కంఠస్తం చేసిన మాత్ర మొకటి ఉందిలెండి) మళ్లీ విడిగా నాలుగు కొత్త సైకిళ్ళ చేశాడు. అనక బెల్బు చర్చుకున్నాడు. అయితే పోలీసులు వచ్చి (కొంత ఇష్టం లేకుండానే) పట్టుకున్నారు. 'ఓనర్లు' వచ్చి సైకిళ్ళ చూసుకున్నారు. అనక మొహా మొహాలు చూసుకున్నారు. ఎట్టకేలకు ఓ గంట అయ్యాక ఈ బెల్ నాదే నన్నాడు 'క' గారు. ఈ ఫ్రేము నాదేనేమో నని నీళ్ళ నమిలాడు. 'గ' గారు. "అదేమో యీ హాండిల్బార్ నాదే" నన్నాడు 'చ' గారు. సారాంశం మాత్రోజుల బయిస్కోపు ప్రొడ్యూసరంత గర్వంగా, అతగాడు 'కథ' సొంతమని బుకాయించినంత ధీమాగా ఆ తెనుగుమీరిన దొంగాడు (హీరో) సైకిళ్లను సొంతం చేసుకున్నాడు. అదీ 'హిట్' మాత్రంలో యీమధ్య అర్జంట్గా వచ్చిన చైతన్యం. అదిగాక మరో సంగతి. "తినగ తినగ గారెలు చేదెక్కును" "వినగ వినగ భారతం సదరు గారెలవలె నుండును" అని ఈమధ్య సినీమార్కుడి బుర్రలో ఓ ఉద్యమం లేచింది. దాంతో అది యింతై అంతై తెనుగులో కథల్నేవు అనే దగ్గరకొచ్చి 4 రోడ్ల జంక్షన్లో ఆగిపోయింది. ఇంకేముంది. రాములవారికి సుగ్రీవుడు సాయంచేస్తే బంట్లు (తెనుగుకథ కాదు) నలుదిశలా వెళ్లిరి అన్నట్లు ఆసేతుహిమాచలం (హాలీవుడ్ని మాత్రం స్థానిక థియేటర్లో చూసి) గాలించాల్సి వచ్చింది. చివరికి యిటు తూర్పున అలా నెత్తిమీదుగా బెం"గాలీ" దొరికింది. దాంతో తక్కువేమీ మనకు 'బెంగాలీ' ఫీల్మెక్కడుందు వరకూ అవి (చిదతలు కావలెను)పించింది. తింటే రసగుల్లాలే తినాలి. తీస్తే బెంగాలీ కథే తియ్యాలి అనేది ఉద్యమం అయిపోయింది. మరో పిట్టకథ: ఆ ఊళ్లో అనగనగా రెండు హోటళ్లు (పిట్టకళ్ల కాదు) ఆ రెండింటికీ పోటీ : అందులో ఒక ఆసామీ ఓ రికార్డు 'ప్లేయర్' పెద్దపైజాది స్వయంగా తెచ్చాడు. రెండోవాడు అదే మార్కువి రెండు తెచ్చాడు. ఝామ్మని ఇద్దరూ అన్నేసి జనాన్ని ఆకర్షించారు. అలాగా : ఓ మాత్రోజుల సినిమాకి బెంగాలీ వాసన బాగా కిట్టింది—ఎంతైనా వాటి ప్రొడ్యూసర్కి యిది పరువుతక్కువే (కన్నెర్రా) కాదుటండీ. వెంటనే రైలు వేగ, కారు వేగాలతో వెళ్లి మరో కథ (లేదా ఆ కథకే రీలు నెంబరులుమార్చి)కొట్టుకురావాల్చిందే. మరో సంగతి బ్రహ్మాండంగా విడుదలచేయడంలో ప్రటిక్కు మాత్రోజుల బొమ్మలు తీసే సినీ "బమ్మ"లకి మాత్రం కాపీరైటుగా తెల్సు.

ఇదేం క్రైముకాదు. క్రైమైతే 'నేషనల్ క్రైము' ఏ జాతీలోలేదు గనుక ? (జాతీయ) నేరం అని అందుకే అంటారు (అదీగాక : లైలా తెనుగుదా ? ద్రౌపది ఆంధ్రపుత్రికా ? 'దేవతా' అన్న "పార్వతి" హైదరాబాద్లో పుట్టిందా?? అమాటకొస్తే ఇవాళ తెనుగు సినిమాలన్నీ ఆరవ

[illegible]
సీక్రెట్''గా దాచేస్తున్నారు(ట). వైరైటీ 'ఎంటర్ టయిన్‌మెంటూ' (రెండూ అశ్లీలాలు కావు (?) తెనుగువీ కావు) ఉండాలిట. అసలు ఫలానా హీరో, హీరోయిను, కమేడియను ఉంటే చాలుట. ఆ ఇద్దరూ ఆయాసంగా పరిగెత్తే సీనులో బరువుగా నడిచినా, నవ్వే సీనులో బ్యాక్‌గ్రౌండ్‌లో నవ్వేసినా చాలుట. జనం క్యూలో నిలబడి హాల్లో క్రిక్కిరిసిపోయి ఈలలు వేస్తారట.

ముఖ్యంగా హీరోకి కారూ, షికారూ, హీరోయిన్‌కి పార్కూ (పాతనూర్ డావుంత చిన్నది చాలు) విలన్‌కి (కోరలూ మీసాలూ బిగించిన పిడికిళ్లూ మళ్లీ ఫ్యాషన్‌గా మారుతున్నాయి) ఒక లాఠీ, ఉక్కు బెల్టూ, జైలు ఖైదీ గళ్లమార్కు బుష్‌కోటూ, చివర్ని వీరమరణం, కమేడియనుకి కావల్సినన్ని సొంత విట్‌లూ, ఓ డాన్సు చేసే పార్ట్నర్ ఉంటే చాలుట. ఆపైన హిందీ పాటలూ, అరవ మాటలూ (తెనుగు అర్థాలతో) ఉండాలిట. ఉంటే కార్నివాల్‌కి వైరైటీ షోలకు మానేసి తెనుగువాళ్లు (రసికులు : లావుపాటి వాళ్లయినహీరోల్నూ హీరోయిన్లనూ'సెక్సు'ను ఆరాధించగలవారు) నూర్రోజులు ఆదే హీరో కోసరం ఓసారి, హీరోయిన్ కోసరం రెండుసార్లు కమేడియన్ కోసరం మూడుసార్లు విలన్ దర్శకుల నిద్దర్నీ కలుపుకుని వెరసి ఆరుసార్లు చూస్తారుట.

తెనుగు హీరో హిందీ హీరోలాగ జెర్కినూ ఫ్యాంటూ వేసుకోవాలనీ తెనుగు హీరోయిను లాగూ చొక్కా (హిందీ తారలాగ) తొడుక్కోవాలనీ, కేవలం లుంగీలకు తప్ప ఇతరత్రా వాడుకునేందుకు వారి శరీరసౌష్టవం పనికిరాకండ పోరాదని ఇలాంటి కోర్కెలే కోరుతారుట. కాని ప్రేక్షకులు విమర్శకులకు మల్లే కథలు కావాలని అందులోను తెనుగు కథలు కావాలని అననే అనరుట. అన్నా సినిమావాళ్లు వినరుట. ★



ఎం. ఎం. పిక్చర్స "అప్పగింతలు"లో రమణమూర్తి, జమున.

# దేశవాళీ బయస్కోపులు

దేశంలో తయారవుతున్నాయి! (చెన్నుడు ఆంధ్రుడుట !) సినీమార్కుడు మూకీల కాలంలో ఉదయించి ప్రస్తుతం మద్రాసులో ఉండిపోయాడు గనుక 'డబ్' చేసే అరవకథలు తెనుగువారు స్వీకరించాలి. అదీగాక 'భక్తధృవ' (తెనుగువాడా? కాడు) మొదలు దేవదాసువరకూ ఈ సిని బాటసారి తెనుగుకథలే తీస్తున్నాడా ? చూస్తున్నాడా ఇవాళ డిమాండు చేయడానికి ? కావాలంటే 'నేటివిట్టీ' కోసరం కొన్ని సెంటిమెంట్సు గోంగూర పచ్చడి అనీ, పెసరట్టనీ ఇలాంటివి హీరోయిను నోట హీరోకి వినిపిస్తే సరి. సరిపోలా ? (మరీ వాదిస్తుం ఉన్నవాళ్ళ నోరు, రవగుల్లా చూపించి యిది బర్రె పెరుగుగడ్డ అని నొక్కియొచ్చును 'కూడా) యింకా మరోరహస్యం ఉంది, అది 'ఎంజోయ్'' చెయ్యడం తెలియాలిటలేండి. వంకాయలు (తెనుగువనుకోండి) సీజను వస్తుందికదా! అప్పుడు చవగ్గా తేలిగ్గా ఇంటి గుమ్మంలోనే దొరుకుతాయి కూడానా ? వాటిని ఓరోజు మెంతి కూరా, వేరొకరోజు పులుసు పచ్చడీ, రేపు ముద్ద కూరా, యివాళ బెంగాలీ మసాలాకూరా చేసికొని ఆనక హిందీ బజ్జీలుగా వేసుకుంటామా? లేదా? అలాగే యివాళ బెంగాలీకథల సీజనో, అరవ బయిస్కోపులకు రిజనో వచ్చిందీ అంటే దానికే ఒకటే అరా తెనుగు సామెతలూ జానపదం (జగదేకవీరుడి మార్కు) గా ఉండేవి చేర్చుకొని క్యూలో నిలబడి టిక్కెట్టు కొనుక్కుని మరీ ఎంజోయ్ చెయ్యాలి. (బెంగాలీ కథదే విజయం అని, ఆడబ్రతుకే మధురం అన్న బాణీలో పాడుకోవాలి.)

ఇంకో రహస్యం ఏమిటీ అంటే తెనుగు ప్రేక్షకుడు కథల కోసరం సినిమా చూడడని ప్రొడ్యూసర్‌లు డైరెక్టర్‌లు హీరోలు ఇత్యాదులు ఆ వర



"సిరి సంపదలు"లో సావిత్రి

# హరివంశం

11-వ పేజీ తరువాయి

తులు. బ్రాహ్మణుడు వేదమునువలె ఈ విద్యను మావారధ్యయనముచేసిరి. దారుకుడో క్రొత్తవాడు. కాశేయుడు కాదు. వాకు వాని విద్యను చూడగా అమర్షకల్గినమాటను నేనేల కాదన వలయును. ఈరోజున అది పరీక్షకు వచ్చినది. వాలోని అహంకార మట్లు చేసినది. నేను నా రథము నాయన రథమునకు అడ్డముగా నిలిపి, మొదట పెట్టుకొనిన సంకేతకము ననుసరించి తక్కిన ద్వారములవద్ద నున్నవారికి తెలియునట్లు, నేను దారుకుని పొడవట్టితిని అని తెలియునట్లు శంఖమును ఊదితిని. దారుకు డేమిచేసినాడు ? నవ్వినాడు. 'మాతలి ! నీవు సరియైన సేవకుడవురా ! నేను నీస్థానమున నున్నచో అట్లులే చేసెదను" అనినాడు. అనినంతలో అతని చేతిలోని పగ్గములు కదలినవి. ఆయన కంఠమునుంచి విచిత్రమైన హెచ్చరిక వెలువడినది. మహారాజా! అతని రథమునకు పూన్చినవి అవి గుర్రములా ! నాకు అనుమానము. పగ్గములు కదిలినంతనే, హెచ్చరిక వినవచ్చినంతనే వానికి రెక్కలు వచ్చినవి. దారుకుడు మరి నన్ను చూడలేదు. నావమాక్షీదేవిని సంబోధించి "తల్లీ ! ఇప్పుడు నేను ఒక చమత్కారము చేయుచున్నాను. నీవును, ఆయనయు భయపడరాదు. ఆయనకు భయమేమి ! సుదామస్వామి ! తమరు భగవంతునికి కూర్చిన మిత్రులు. నాకు ఆయనయు, మీరును ఒక్కటి. మరియు తాము బ్రాహ్మణులు. భగవంతునకును పూజనీయులు. ఇదుగో రథము కదులుచున్నది." అనినాడు. రథము కదిలినది. ఆరథమునకు పూన్చబడిన హయములు తెల్లనివి. మేఘములవలె నున్నవి. మేఘములవలె కదలినవి. రెక్కలతోడి మేఘములు. మేఘగర్జనమును పోలిన హేషలు. ఆహా! నా గుర్రములు కింకర్తవ్యతావిమూఢములైనవి. నేను పగ్గములను కదల్చితిని. బిగించితిని. సడలించితిని. కశను ఎత్తబోతిని. దారుకస్వామికి శరీరము నిండ కన్నులు. ఆయన "ఓరి మూర్ఖుడా ! నీవు సారథివి" అన్నాడు. అవహేళనావిద్ధముగ నవ్వినాడు. నన్నును, నా రథమును అధఃకరించుచున్నదివలె ఆయన గుర్రములు కదిలినవి. నాల్గు గుర్రములు ముంగాళ్లను లేపి, వెనుకకాళ్లపై కొంత వెనుకకు నడచి తరువాత ముందుకు లంఘించినవి. ఆ లంఘించుట మహారాజా ! హనుమ సముద్రమును లంఘించుటను బోలియున్నది. ఆ గుర్రములు అప్పుడు చేసిన హేషలతోడి దారుకుని సింహనాదము నన్నును, నా గుర్రములను బధిరితము చేసినది. నేను స్థాణువునైనాను. నా గుర్రములు కదలలేదు. ఏ తళ్లంఘనముతో రథము గాలిలో తేలి విమానమువలె నెగడి. ఆ వేగము విచిత్రము. క్షణములో ఆరథము నా రథమును దాటిపోయినది. నేను సిగ్గుపడినాను. ఎందుకు సిగ్గుపడినావనగా, దారుకు డింత చేసియు తన గుర్రములను అదలించలేదు. ఒక్కమాట అనలేదు. కశను ముట్టలేదు. నేను ఆయన అన్నట్లు మూర్ఖుడను. నా గుర్రములకు నాయందు ప్రేమ యుండునా! గౌరవముండునా ! అవి నామాట వినునా ! అందుకే ఆయన నన్ను 'మూర్ఖుడ' అన్నాడు. మహారాజ ! రథసారథ్యములో దారుకస్వామి నాకు నేడు నేర్పిన మొదటి పాఠమిది."

మాతలి ఇంతవరకును కన్నులను మూసికొని జరిగినదానిని చూచుచు చెప్పుచున్నట్లు ఉండెను. ఇప్పుడు కన్నులు తెరచెను. తెరచి అందరివంకను చూచెను. ఒక్క పౌండ్రకుడుమాత్రమే గవాక్షమువద్దనుండి కదలలేదు. ముందు ఎటుల చూచుచుండెనో ఇప్పుడును అటులనే మంది బాహ్యదేశమును, గవాక్షమునుండి చూచుచు నిలబడెను. తక్కిన అందరి ముఖములయందును అద్భుతమును, ఆశ్చర్యమును కన్పడుచుండెను. మరి పౌండ్రకుని అనుభవమెట్లులున్నదో ! మాతలి యేమియు ఆలోచించలేదు.

అంతలో పౌండ్రకు డనెను.

"మాతలీ ! తరువాత !

# గమనిక

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు పంపే రచనలు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక పేర మాత్రమే పంపాలి. వ్యక్తుల పేర్లు వ్రాయవద్దని మనవి

# రూమ్ మేట్

9—వ పేజీ తరువాయి

గట్టి సిగరెట్టు దమ్ములాగి, పొగ వదిలాడు లాయరు కైలాసరావు. "అసలు నువ్వు ఆత్మహత్య చేసుకోవలసినంత అవసర మేమొచ్చిందీ?" అని అడిగాడు శ్యామలరావుని.

"అదంతా అడక్కు మామయ్యా. నా విషాదగాథ వింటే నీ హృదయం చిల్లులుపడిపోతుంది. ఇహ నా జీవితం విషాదాంతం కావలిసిందే. భగ్నప్రేమికుల గతంతే!" అన్నాడు శ్యామలరావు. తన నిశ్చయానికి తిరుగులేదని తెలియజేస్తూ.

కైలాసరావు కొద్దిక్షణాలు శ్యామలరావువైపు తీవ్రంగా చూశాడు, సిగరెట్టు కాలుస్తూనే. అతని మొహంలో చిన్న చిరునవ్వుదయించింది. "అసలు విషాదాంతం అంటే ఏమిట్రా?" అని అడిగాడు మేనల్లుణ్ణి.

ఈ ప్రశ్న తనకు కొంచెం చిరాకు కల్గించినా, తన తెలివితేటల్ని శంకించనక్కరలేదని మామయ్యకు తెలియజేద్దామనే ఉద్దేశంతో జవాబిచ్చాడు శ్యామల రావు, "విషముతో అంతమౌతుంది, అంటే చివరికి విషం పుచ్చుకోవడం జరుగుతుంది. నేనూ మంచి విషాన్ని సంపాదించాలని చూస్తున్నాను."

"కేవలం విషమే అక్కరలేదు. తత్తుల్యమైన దేదైనాసరే" అని ఒక్కక్షణంఆగి, "నే నో కథ చెప్తా విను" అన్నాడు కైలాసరావు.

"ఎవరికథ?" అన్నాడు దిగులుగా శ్యామలరావు, నిజాని కిది తనకి కథలతోనూ, కబుర్లతోనూ కాల క్షేపంచేసే సమయంకాకపోయినా, మామయ్య కథలు వింటే కాస్త మనస్సుకు చల్లగావుండి, కొద్దిసేపు తన బాధని మర్చిపోవచ్చుకదా అని.

కైలాసరావుకి మనస్తత్వాల్ని పరిశీలించడం చాలా ఇష్టం. తన మేనల్లుడి మనస్తత్వాని కనుగుణంగా తనకు జ్ఞాపక మొచ్చిన ఒక సంఘటనని చెప్పదల్చాడు. "విషాదాంతమనేది పైనుండి చూసేవారికొక అద్భుత మైన సుఖాంతంగా కన్పించినప్పుడే నిజమైన విషాదాంతం. అంతేకాని, మనుష్యులు హఠాత్తుగా ప్రాణాలు వదిలెయ్యనక్కరలేదు" అని ఒకసారి ఆగి, పాత సిగరెట్టుతో కొత్త సిగరెట్టు వెలిగించాడు.

"మా రూముమేటు జీవితం అందుకొక గొప్ప ఉదాహరణ. నేను ఆర్ట్స్ కాలేజీలో బి. ఏ. చదువు తున్నప్పుడు నాతో హరనాథ్ అని ఒక యువకుడు రూముమేటుగా ఉండేవాడు. అతను చాలా నెమ్మదైన స్వభావం కలవాడు. సన్నగా ఉండేవాడు. ఎవరితోటీ ఎక్కువగా మాట్లాడేవాడుకాదు. కాలేజీలో అమ్మాయిలవైపు తలెత్తి చూసేవాడుకాదు. మే మిద్దరం చాలా స్నేహంగా ఉండేవాళ్లం."

"హరనాథ్ చాలా బీదకుటుంబంలోంచి వచ్చాడు. చిన్నప్పటినుంచీ కష్టపడి ప్రయివేట్లు చెప్పుకొని స్కాలర్‌షిప్పులు సంపాదించీ పైకి వచ్చేడు. కాలేజీలో చదువుతున్న రోజులలో కూడా ప్రయివేట్ల ద్వారా డబ్బు సంపాదిస్తూండేవాడు. అతనికి ఏ దుర్వ్యసనాలూలేవు. లెక్చరర్లందరికీ అతనిమీద చాలా సద్భావం ఉండేది."

"అప్పుడప్పుడు లెక్చరర్లు ఏవైనా ప్రయివేట్లు హరనాథ్‌కు అప్పచెప్తూండేవారు. అతని మంచితనం మీదా, వినయ విధేయతలమీదా వారికి చాలా నమ్మకం ఉండేది. మేము బి. ఏ. మొదటి సంవత్సరం చదువుతున్న రోజులలో మా తెలుగు లెక్చరరుగారు ఒకనాడు హరనాథ్‌ని పిలిపించి, అతనికి ఒక ప్రయివేటు అప్పచెప్పారు. ఒక రిటైర్డు డిప్యూటీ కలక్టరుగారి మనవరాలిని మెట్రిక్ పరీక్షకు కట్టించాలి."

"ఆ అమ్మాయి వయస్సు పదిహేనేళ్ళు. గుండ్రటి మొహం, సూటైన ముక్కూ, విచ్చిన తామరపద్మాల్లాంటి కళ్ళూ, ఆ కళ్ళతో మామూలుగా ఆమె చూస్తున్నా చిన్న చిరునవ్వు నవ్వుతున్నట్లుండే మొహం, సన్నటి నడుము, ఎటువంటి యువకుడినైనా మతి చెడగొట్టుకునేట్టు చేసే అందం ఆమెలో ఉంది. మొట్టమొదటి రోజున హరనాథ్‌తో నేనూ వాళ్ళింటికి వెళ్ళేను. డిప్యూటీ కలక్టరుగారి పేరు రామస్వామిగారు. ఆయనకు డెభ్భై ఏళ్ళు దాటాయి. ఆయన కొడుకు హఠాత్తుగా చనిపోతూ, ఒక అబ్బాయీ, ముగ్గురు అమ్మాయిలూగల తన కుటుంబాన్ని అప్పచెప్పాడు. అబ్బాయి అంటే రామస్వామిగారి మనవడు ఢిల్లీలో ఏదో పెద్ద మిలటరీ ఆఫీసరు ఉద్యోగంలో ఉన్నాడు. మనుమరాళ్లలో పెద్దమ్మాయికే ఈ ట్యూషన్. ఆమె పేరు నళిని."

"ఆ ట్యూషన్ ప్రారంభించిన కొద్దిరోజులలో హరనాథ్‌తో చాలా మార్పు వచ్చింది. తన దుస్తులమీదా, అలంకరణమీదా శ్రద్ధ బాగా హెచ్చిందతనికి. ఎప్పుడూ చాలా హుషారుగా ఉండేవాడు. రాత్రి రూముకు చాలా ఆలస్యంగా రావారంభించాడు. ఈ మార్పులన్నీ కనిపెట్టి నేనూ, మరికొందరు మిత్రులు కలిసి గట్టిగా అతన్ని అడిగేశాం, 'అసలు సంగతేమిటో చెప్పమ'ని. మమ్మల్ని ఆట్టే సస్పెన్సులో పెట్టకుండా, నళినిని తను ప్రేమిస్తున్నానని చెప్పాడు. అందుకు మేము చాలాఆనందించాం, కాని ఆ అమ్మాయి ఉద్దేశమేమిటో తెలుసుకోకుండా ఈ వ్యవహారంలో దిగటం మంచిది కాదని సలహా ఇచ్చాం. దానికి అతను, అసలా అమ్మాయే ఎక్కువ చొరవ చూపించిందనీ, అనేక విధాల తన ప్రేమను తెలియజేయనారంభించిందనీ, తను అప్పుడుగాని తన ప్రేమ బయట పెట్టలేదనీ ఒక బాంబులాంటి స్టేట్‌మెంటు ఇచ్చాడు. అదివినగానే మాకుషాక్ తగిలినంతపనైంది. నళినిలాంటి అందాల భరిణ, సౌందర్యమూర్తి, సుకుమారస్త్రీ, పసిడిబొమ్మ ఈ హరనాథ్‌ని ప్రేమించిందంటే, "మనం స్వప్నంలో కూడా ఊహించలేని విషయాలెన్నో, ఆ దివిలోనూ, ఈ భువిలోనూ జరుగుతున్నాయి" అని చెప్పిన షేక్స్‌పియర్ మాటలు నిజమనిపించాయి. హో! ఒథెలో—నీలో ఏంచూసి, డెస్డిమోనా, ప్రేమించిందో కదా! అని అనుకున్నాం."

"ఆ రోజుల్లో—నేనూ మరికొందరు మా స్నేహితులం కలిసి 'అమ్మాయిలు అబ్బాయిల్లో ఏంచూసి ప్రేమిస్తారు?' అన్న విషయంమీద రిసెర్చి చేయదల్చాం. మాకు ప్రప్రథమంగా లభ్యమైన, వాస్తవిక సంఘటనా వివరాలు—నళినీ హరనాథ్‌ల ప్రణయ విశేషాలే. మెజీషియన్ చేతుల్లోంచి రిస్టువాచీలూ, రూపాయలూ తీస్తున్నకొద్దీ వస్తున్నట్లు, వీళ్లిద్దరి మధ్యా ప్రేమలేఖలు నడవనారంభించాయి. మాకు

## అత్యున్నతమైన

# ఫ్రెంచి కాఫీ






ప్రత్యేకముగా రుచి ఎంచువారలకు పరివడునట్లుగా బ్లెండు చేయబడి, అప్పటికప్పుడు గింజలను వేయించి పొడి చేయబడి, సువాసన వెలికి పోకుండ ఉండులాగున, బ్రూక్ బాండ్ కేఫే బ్రాండు ఫ్రెంచి కాఫీ సెలోఫేన్ సంచులలో మీకందజేయబడుతున్నది. శ్రేష్ఠమయిన చక్కటి రుచికల్గిన ఫ్రెంచి కాఫీ కావలెనంటే, బ్రూక్ బాండ్ మీదే ఆధారపడండి. మీరు కొనుటకు అత్యంత శ్రేష్ఠమయినది ఇది ఒక్కటే.

# బ్రూక్ బాండ్

# కేఫే బ్రాండ్ ఫ్రెంచి కాఫీ

MTBB 404

# రూమ్ మేట్

ఈ వ్యవహారంతోఉన్న సంబంధమల్లా కేవలం వైజ్ఞానికదృష్టి! మా రిసెర్చికి ఉపకరించే ప్రయోగంగా మాత్రమే ఈ వ్యవహారం పరిశీలించదల్చాం. హరనాథ్ కూడా మా ప్రయత్నానికి సానుభూతితో సహకరించి ఎప్పటికప్పుడు వివరాలన్నీ మాకు అందజేస్తూండేవాడు. అందువలననే, మా కాలేజీ రికార్డుకు నాలుగింతల రికార్డొకటి సంవత్సరంలోపలే మేము తయారు చెయ్యగలగాం—వీళ్ల ప్రణయం గురించి" అని కైలాసరావు ఆగాడు.

అంతవరకూ ఓపికగావిన్న శ్యామలరావు ఒక దీర్ఘ నిట్టూర్పు విడిచి, "ఇంకేముందీ? వాళ్లిద్దరికీ పెళ్లయిపోయి ఉంటుంది" అన్నాడు.

"లేదురాఅబ్బీ! అలా జరిగితే ఈ కథే లేకపోను. సాధారణంగా ఒక ప్రత్యేకమైన గదిలో ఈ ప్రయివేటు జరుగుతూండేదిట. ఆ గదిలో కెవరూ వచ్చేవారు కారుట. రామస్వామిగారు ఎప్పుడైనా వచ్చేవారట. ఆయనకు పాంకోళ్లు వేసుకోవడం అలవాటు కాబట్టి ఆయనరాక సులభంగా ముందే తెలిసేది. అందువల్ల ప్రయివేటు పాఠం కాస్త అప్పుడప్పుడు దారి తప్పుతూండేదిట. ఒకనాడు రామస్వామిగారి పాంకోడొకటి విరిగిపోవడంవల్ల ఆయన వట్టి కాళ్లతోనే నడవవలసి వచ్చిందట. ఆవాళ సాయంకాలం హరనాథ్, నళినికి ప్రయివేటు చెప్పే సమయంలో ఆ గదిలోకి ఏదో పనుండి రామస్వామిగారు వెళ్లారట. అక్కడ ఆయనకంటబడ్డదృశ్యం....." అని ఆగి కైలాసరావు, పాత సిగరెట్టుతో కొత్త సిగరెట్టు వెలిగించుకుంటూంటే, శ్యామలరావు ఆతృతగా "ఏం దృశ్యం మావయ్యా?" అని అడిగాడు, ఆ దృశ్యాన్ని వూహించుకోడానికి ప్రయత్నిస్తూ.

కైలాసరావు లాభం లేదన్నట్లు తలూపుతూ "ఆ దృశ్యం, పెన్నారువాళ్లు సినిమాల్లో కత్తిరించేసే దృశ్యంలాంటిది—అది చూడగానే రామస్వామిగారు మండిపడ్డారుట. హరనాథ్ నళినులు ఎంతమాత్రం బెంగారుపడక, తా మిరువురమూ ప్రేమించుకున్నామనీ, వివాహం చేసుకోదల్చామనీ చెప్పారు. ఆయన కొద్దిగా ఆలోచించి, వారి వివాహం గురించి తరువాత నిర్ణయిస్తాననీ, ఈ లోపల ట్యూషన్ ట్యూషన్‌లాగ మాత్రమే నడవాలని చెప్పారు. హరనాథ్ అందు కంగీకరించాడు. తరువాత రామస్వామిగారు కొద్ది రోజు లాలోచించి, హరనాథ్ చాలా బుద్ధిమంతుడనీ, అతనికి నళినినిచ్చి వివాహం చెయ్యడం మంచిదేనని నిశ్చయించి, తన నిశ్చయాన్ని, ఈ పరిస్థితుల్ని ఢిల్లీలోవున్న మనవడికి తెలియజేసారు. వెంటనే అతనివద్దనుంచి ట్యూషన్ మానిపించాలనీ, తను సెలవుపెట్టి వస్తున్నాననీ టెలిగ్రాం వొచ్చింది."

"నళిని అన్నపేరు కృష్ణమూర్తి. అతను మంచి పర్సనాలిటీగల పాతికేళ్ల యువకుడు. అతను సెలవుపెట్టి వచ్చిన మరునాడే, హరనాథ్‌ని పిల్చి, అతనికి తన చెల్లెల్నిచ్చి వివాహం చెయ్యడం అసంభవమనీ, తన చెల్లెల్ని ఒక పెద్ద ఆఫీసరుకు మంచి కట్నమిచ్చి వివాహం చెయ్య నిశ్చయించామనీ, అందువల్ల హరనాథ్ ఆ ఇంటికిరావడంగాని, నళినితో మాట్లాడడంగాని

# రూమ్ మేట్

తను జరగనియ్యనని చెప్పి పంపేశాడు. ఆనాటితో హరనాథ్ మధుర స్వప్నాలన్నీ కరిగిపోయాయి. అత నిలో హుషారంతా నశించింది. తిండిమీదా, బట్టల మీదా, నిద్రమీదా ఆసక్తి నశించింది. ఎప్పుడూ దిగులుగా, విచారంగా ఉండసాగాడు."

"అతని పరిస్థితికి మేమంతా చాలా విచారించాం. కృష్ణమూర్తి వద్దకువెళ్ళి, అతనికి జాలిపుట్టేటట్లు హరనాథ్ స్థితి వర్ణించాం. నళినీ, అతనూ ఎంతో ప్రేమించుకున్నారనీ, ఎన్నో ప్రేమలేఖలు రాసుకున్నారనీ, వారి నిద్దరినీ విడదియ్యడం మహాపాపం అని చెప్పాం. అతను తన చెల్లెల్ని, ప్రయివేట్లు చెప్పుకొని చదువుకొనే బీద కుర్రాడి కివ్వదల్చుకోలేదనీ, అథమం 'గజిటెడ్ రాంకు'లోనైనా ఉన్నవాడికి పది పదిహేను వేలు కట్నమిచ్చి పెళ్ళిచెయ్యదల్చుకున్నానని చెప్పాడు. మేమెంత బ్రతిమాలినా అతను వినకపోయేసరికి మాకు కోపంవచ్చి, అతను నళినికి ఎలా పెళ్ళిచేస్తాడో చూస్తామనీ, ఆమె పెళ్ళికి మేమంతా హాజరయి, ఆమె హరనాథ్ కు రాసిన ప్రేమలేఖల్ని పెళ్ళికొడుక్కి కానుకగా చదివిస్తామని బెదిరించాం. దాని కతను మమ్మల్ని మాకిష్టం వచ్చినట్లు చేసుకోమన్నాడు. మేము ఆపని విధిగా చేసితీరాలని నిశ్చయించుకున్నాం. హరనాథ్ విచారం రోజురోజుకు ఎక్కువ కాసాగింది. ఒకనెలరోజులుగడిచాక మాకొక ఆలోచన తట్టింది."

"అసలు కృష్ణమూర్తి సెలవుమీద ఇంటికివచ్చిన దగ్గర్నుంచీ నళిని ఇల్లువిడిచి కదలడంగానీ, వీథి గుమ్మంలో కన్పించడంగానీ మానేసింది. దానికి కారణం కృష్ణమూర్తి ఆమెకు కల్పించిననిర్బంధమేనని మేము గ్రహించాం. ఆమెగనుక హరనాథ్ ను కలిస్తే వారిద్దరూ ఏదైనా సరారి ప్రయత్నం చేస్తారేమోనని అత నమమానించివుండవచ్చు. మేము ఎలాగైనా ఆమె గనుక బయటకువస్తే, హరనాథ్ ను ఆమెతో మాట్లాడించి, వారిద్దరి రహస్య వివాహానికి ఏర్పాట్లు చేసి కృష్ణమూర్తికి తగిన పాఠం చెప్పాలని నిశ్చయించాం. ఒకనెలరోజులు, డిటెక్టివ్‌లులా వారింటి చుట్టూ తిరిగాం. ఆఖరికి ఒకనాడు నళిని, కొంత మంది స్నేహితురాళ్ళతో సినిమాకు బయల్దేరడం చూసి, మేం వెంటనే రూముకి పరిగెట్టుకువెళ్ళి, హరనాథ్ ని బయల్దేరదీశాం. సినిమా థియేటరులో వీరిద్దరి కలియిక అద్భుతంగా ఉంటుందనుకొన్నాం. ఒకర్నిచూసి ఒకరు కంట తడిపెట్టుకుంటారనీ, ఆనంద దుఃఖ సమ్మిశ్రితభావాలతో మథనపడిపోతారనీ అనుకున్నాం....కాని నళిని, హరనాథ్ ని చూసి, మొహం తిప్పేసుకుంది. హరనాథ్ ఆమెవద్దకువెళ్ళి పలకరించబోతే, అతనిని తను మర్చిపోయానని, ఎవరో కొత్తవారితో మాట్లాడినట్లు మాట్లాడింది. తమ ప్రేమను జ్ఞాపకం చెయ్యబోతే, అనవసర ప్రసంగం చెయ్యవద్దని హెచ్చరించింది. దాంతో హరనాథ్ మతిపోయినట్లయి రూముకు వచ్చేశాడు.

ఆ సంఘటన అతనిలో చాలా మార్పు తెచ్చింది. మరునాడు తన పెట్టెలో అంతవరకూ భద్రంగా దాచిన నళిని ఉత్తరాలన్నీ తీసి తగలపెట్టేశాడు. ప్రత్యేకంగా కృష్ణమూర్తివద్దకు వెళ్ళి తను నళిని

# రూమ్ మేట్

ఉత్తరాలన్నీ తగలబెట్టేశావనీ, ఇక అతను నిర్భయంగా నళినిపెళ్ళి జరిపించుకోవచ్చునని చెప్పేశాడు. మరో నెలరోజులలో నళిని పెళ్ళి ఒక ఆఫీసరుగారితో, పది వేల కట్నంతో జరిగిపోయింది."

శ్యామలరావు, "అయితే హరనాథ్ ని ఆమె పూర్తిగా మర్చిపోయిందన్నమాట! అమ్మాయిలంతా అంతేనా మామయ్యా?" అన్నాడు దిగులుగా.

"ఏమోరా! బహుశా పెద్దవాళ్ల మనస్సు నొప్పించలేక అలాటిపెళ్ళి కొప్పుకుంటారేమో!" అని కైలాసరావు అన్నాడు మేనల్లుడి మొహం చూస్తూ.

"హు! అయితే పాపం ఆ పవిత్ర ప్రేమికుడు హరనాథ్ ఆత్మహత్య చేసుకున్నాడా?" అనడిగాడు శ్యామలరావు. విఫలప్రేమికులందరి మనస్తత్వం ఒకలాటిదేనని భావిస్తూ, ఆత్మహత్యే వారికి గత్యంతరమని తీర్మానించాడు.

"లేదురా. ఆ సంవత్సరం బి. ఏ. పరీక్షలో ఫేలయ్యాడు. అంతేకాక, తానిక చదవలేనని, జీవితంలో ఎందుకూ పనికిరానని నిశ్చయించుకొని, ఆ ఊళ్ళో ఒక చిన్న కంపెనీలో తక్కువజీతంమీద ఉద్యోగానికి చేరాడు. నళిని హరనాథ్ ని చాలా సులభంగా మర్చిపోగలిగిందిగాని, హరనాథ్ నళిని నెప్పటికీ మర్చిపోలేకపోయాడు. ఒక్కొక్కసారి వారాలకొద్దీ దిగులుగా ఉండేవాడు. ఆ దిగులు మర్చిపోవడానికి ఏదైనా విపరీత కార్యం చెయ్యాలని ఆలోచించేవాడు" అని కైలాసరావు అంటే, శ్యామలరావు, "అందుకే మామయ్యా! ఆ మహానుభావుడు—దేవదాసు, త్రాగుడు అలవాటు చేసుకున్నాడు. విఫలప్రేమికులంతా అంతే" అన్నాడు.

"కాని హరనాథ్ ఏం చేశాడంటే, హఠాత్తుగా తను పని చేస్తున్న కంపెనీలో అయిదువేలు అపహరించి మద్రాసు పారిపోయి ఇష్టం వచ్చినట్లు తిరగ నారంభించాడు. అతని ఉద్దేశం, తను ఈ తప్పుచేసినట్లు, తన యజమాని పోలీసులకు రిపోర్టు ఇస్తే, వాళ్ళు తనను అరెస్టుచేసి జైలులో పెడ్తారని, అప్పుడు జైలులో కష్టాలనుభవిస్తూ నళినిని మర్చిపోవచ్చునని. కాని, విధి మరోలా ఉద్దేశించింది! అసలు హరనాథ్ ఎత్తుకుపోయింది, వాళ్ళ కంపెనీ యజమాని బ్లాకుమార్కెట్టులో గణించిన సొమ్ము. దాని గురించి రిపోర్టిస్తే తనకే ముప్పు రావచ్చునని ఆ యజమాని రిపోర్టివ్వలేదు. ఒకనెలరోజులవరకూ ఏమైనా జరుగుతుందేమోనని ఎదురుచూసిన హరనాథ్, ఏమీ జరగకపోయేసరికి ఏంచెయ్యాలో తోచక, తనవద్ద మిగిలిన డబ్బుతో ఒక చిన్నకొట్టు పెట్టాడు. మూడేళ్ళు గడిచేసరికి ఆ కొట్టుమీద పదివేలు లాభం వచ్చింది."

శ్యామలరావు, "మరి అతను నళినిని మర్చిపోగలిగాడా?" అని అడిగాడు.

















## క్యాలెండర్లు

నాణ్యమైన ఫోటో ఆఫ్‌సెట్ క్యాలండర్లకు మమ్ము సంప్రదించండి. క్యాలండరు బొమ్మలను క్యాలెండరు ప్యాడ్లను ఫ్యాక్టరీలకు, ప్రింటర్లకు ప్రత్యేక ధరలకు సప్లయి చేయుగలము.

మంచికమీషనుపైపని చేయుటకు సమర్థులైన ఏజంట్లు కావలెను. వ్రాయండి.

ELITE CALENDAR Co.,
P. B. 1927, MADRAS-1

## ఉచితము

"కాశ్మీర్ బ్యూటీ" 6 గజముల చేనేత చీరలధరలు ఆశ్చర్యకరంగా తగ్గింపబడినవి. 6 గజముల చీర రు 8/- (అసలు ధర రు. 12) 2 చీరలు రు 15/- 3 చీరలు రు 21/- పోస్టేజితో



సహా. 3 చీరలు కొనువారికి సిల్కు బ్లౌస్ & క్రొత్త సంవత్సర డైరీ ఉచితము.

SATISH & CO (A P. W.)
Jama Masjid, Delhi-6.

## స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములకు



## లోధ్ర



కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14

ఏజంట్లు:
సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
విజయవాడ-విశాఖపట్నం-మధుర-బరంపురం-బెంగుళూరు

## RATNAM'S N-OIL

(పైపూతకుమాత్రమే)

అంగవరములు బలహీనత చెంది, చిన్నదనచో 1881 ఆయుర్వేదప్రకారం ఆయుః పూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి కలది. 1 సీసా రూ. 10 లు వి. పి. 1-4-0 కావలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇంగ్లీషులో స్పెషల్ రకం ఆర్డరుటుకూనా నకు రూ. 25-0-0 లు.

డాక్టర్. రత్నం సన్స్, (Estd 1904 ములక పేటబిల్డింగ్స్, అజంపూరా రూ గేట్ దగ్గర, హైదరాబాద్ 24 (ఆంధ్రప్రదేశ్)

## డాక్టర్ వృత్తి చేయండి!



విరామకాలంలో ఇంటిలో పోస్టల్ ట్యూషన్ ద్వారా హోమియోపతి చదివి, గవర్నమెంటు రిజిస్టర్డు కాలేజిద్వారా డిప్లొమా పొందండి.

ప్రాస్పెక్టస్ ఉచితం. ఇంటనే వ్రాయండి.

INDIAN HOMOEOPATHIC COLLEGE
(APM), JULLUNDUR CITY

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వ్రేళ్లు పాతుకుపోయి పాదము నేలపై పెట్టలేక రక్తము తగిలిన త్రుళ్ళిపడువారు పైపూతగా వాడిన వేళ్ళతో సహా మాయంచేయగల పాదరక్షిణి. వెల పోస్టు ఖర్చుతో 4-4-0.

కొక్కోకము వివిధ చిత్రపటములతో కలది. వెల పోస్టు ఖర్చులతో సహా రు. 2-4-0.

ప్రభ అండ్ కో. (P)
3, మలయ పెరుమాళ్ వీధి, (మిద్దపైన)
మద్రాసు-1.

స్థాపితం 1920

రెడ్డి అండ్ కో. (రిజిష్టర్డు)
గోపాలపురం తూ. గో. జిల్లా

కుష్ఠు బొల్లి మేహపొడ వగైరా చర్మ సుఖ వ్యాధులకు ప్రత్యేక చికిత్స.

శాస్త్రీయ ఆయుర్వేద ఔషధములు లభించును

→ కేటలాగు సలహా ఉచితము

ఇంటిల్లిపాదికీ ఆనందం చేకూర్చే
ఆంధ్రసచిత్రవారపత్రిక
తప్పక చదవండి!

## శ్రీ బాలాంజనేయ ప్రశ్న

సంతానము, రోగములు, గ్రహబాధలు, వివాహం, పారిపోయిన పశువులు, మనుష్యులయొక్క ఆచూకీ, దొంగిలింపిన సొమ్ము, విడిపోయినభార్య మొదలు కోరిన 5 ప్రశ్నలకు జవాబు తేల్చివ్రాసి పంపగలను. రూ 2 ఎం.ఓ. చేయండి. నెలనెలకీగా 12 నెలలకు 1 సంవత్సరం జాతకము రూ 2. పూర్తి పేరు, జాబువ్రాసిన సమయము తెలిపిన చాలును.

హనుమాన్ జ్యోతిషాలయము,
10వ లైను, అరండల్ పేట, గుంటూరు

## ఒక సీసా, అనేక చికిత్సలు!

FOR EXTERNAL USE for the relief of muscular congestion & rheumatism
SLOAN'S LINIMENT
TRADE MARK
KILLS PAIN
Dr. Earl S. Sloan
Manufactured in India by MARTIN & HARRIS (PRIVATE) LTD., 1 B, Ashutosh Mukherjee Road, Calcutta 20
DIRECTIONS: Apply the liniment liberally with a soft flannel cloth
Mark Owned by STANDARD LABORATORIES INC.

కీళ్ల వాతము, వాపునొప్పులు కండరవాపులు అనవల మూలంగా కలిగే బాధలు. స్లోఅన్స్ లినిమెంట్ ఉపయోగించండి స్లోఅన్స్ మీ నొప్పులను తక్షణం దూరంచేస్తుంది.

వార్నర్-లాంబర్ట్
ఫార్మస్యూటికల్ కంపెని
(పరిమితబాధ్యతలతో యు.ఎస్.ఏ.లో స్థాపితము)

TEL

# రూమ్ మేట్

"లేదు. ఆమెను మర్చిపోవడానికే విపరీతంగా కష్టపడి వ్యాపారంలో పని చేస్తూండేవాడు. అది డబ్బు రూపంలో అతనికి లాభించేది. కాని డబ్బంటే అతనికి మోజులేదు. డబ్బువల్లే నళిని తనకు దక్కలేదని అతని అభిప్రాయం. అతను తనకు లాభమొచ్చిన పదివేలు ఏమి చెయ్యాలా? అని ఆలోచిస్తూంటే, రోడ్డుమీద నళినిలాంటి అమ్మాయే కనిపించి మళ్ళీ అతన్ని దిగులావరించింది. ఆ దిగులుతోనే ఆ పదివేలూ పట్టుకొని గుర్రప్పందాలకు వెళ్ళిపోయి, ఆడబ్బు గుడ్డిగా ఒడ్డడం మొదలెట్టాడు. సాయంకాలానికి ఇరవై లక్షలు గెల్చాడు గుర్రప్పందాల్లో. మర్నాడు, మళ్ళీ వెళ్దామనుకున్నాడుగాని ఇంకా గెల్చేస్తానేమో అని భయపడి వెళ్ళలేదు. ఆ డబ్బుతో ఏం చెయ్యాలా? అని ఆలోచించి వరసగా భగ్నప్రేమికుల మీద సినిమాలు తియ్యడం మొదలెట్టాడు. ఆ సినిమాలన్నీ శతదినోత్సవాలు చేసుకుని అతనికింకా డబ్బు ఆర్జించి పెట్టాయి. చివర కత నొక సినిమాస్టారును పెళ్ళి చేసుకున్నాడని విన్నాను. అప్పటికన్నా నళినిని మర్చిపోయిఉంటాడని నేననుకోను. ఇహ ఆ జీవితమంతే— అనర్లైన సినర్లైన విషాదాంతం!"

శ్యామలరావు, "నిజమే మామయ్యా! ఆ జీవితంతో పోల్చిచూస్తే ఆత్మహత్య సుఖాంతమే అవుతుంది. నేను ఆత్మహత్య చేసుకోను! కమలమీద దిగులుతో ఇలా క్రుంగి కృశిస్తా, అన్నం నీళ్ళూ మానేస్తా, దేశమంతా తిరిగేస్తా..." అని అంటూంటే కైలాసరావు ఆఫీసుగది తెరుచుకొని అతనిభార్య ఉషాసుందరీదేవి, మరొక పద్దెనిమిదేళ్ళ అందమైన అమ్మాయీ ప్రవేశించారు.

ఉషాసుందరీదేవి "నువ్వంత బాధపడక్కరలేదోయ్! ఇదిగో మీ ఇద్దరి సంభాషణ విని కమల తన పొరపాటుకు చాలా విచారిస్తోంది" అంది.

శ్యామలరావు ఆశ్చర్యంగా, "నిజమేనా! కమలా" అని కమలవైపు ఆనందంతో చూశాడు.

"అవును శ్యామ్. ఇందాకటినుంచీ ప్రక్కగదిలో కూర్చొని బాబాయిగారి మాటలూ, నీమాటలూ వింటూంటే నా తప్పు తెలిసింది. నిన్ననవసరంగా శంకించాను. అందుకు క్షమించు" అంది ఆ అందమైన కమల.

కైలాసరావు, "అయితే ఇందాకటినుంచీ మీరు మా మాటలు వింటున్నారన్నమాట."

"అవును. సరిగ్గా శ్యామ్ ఉత్తరం మొదలెట్టినప్పుడే కమల మనింటికి వచ్చింది. మే మిద్దరం తలుపుచాటున మీ మాటలు విన్నాం. శ్యామ్ హృదయాన్ని కమల పూర్తిగా గ్రహించింది" అంది ఉషాసుందరి.

"ఆహా! అలాగయితే మన కర్తవ్యాన్ని కూడా నువ్వు పూర్తిగా గ్రహించివుంటావు" అన్నాడు కైలాసరావు కుర్చీలోంచి లేస్తూ. శ్యామ్, కమలా ఒకరిని చూసి ఒకరు నవ్వుకున్నారు. ఉషాసుందరీదేవి, "అవును, మీరు మరోకథ మొదలెట్టకుండానే మన [illegible]క్కరు ప్రోగ్రాం గుర్తు చెయ్యడమే నా కర్తవ్యం. పదండి మన మిద్దరం సినిమాకు పోదాం" అంది, భర్తతో గది బయటికి నడుస్తూ.










# సరాగమాల

15-వ పేజీ తరువాయి

టానికి కొన్ని ఘడియలు. ఆ కళాసృష్టి సంపూర్ణ సౌందర్యాన్నితనివిదీరఆస్వాదించటానికి కొన్నియుగాలు.

రెండవప్రక్క నున్న "నిత్యవినోదం" శ్రీనివాస్ ఎల్లారీశ్వరి పాడిన యుగళగీతం, క్లబ్‌డాన్సు. ఈశ్వరి కంఠంలో కొంచెం వెలితి కనిపిస్తున్నా పండీ పండని మామిడిపండులో పులుపులాగ అదీ ఒక అందంగానే ఉంది. ఆమె నిత్య వినోదం ఈ లోకంలో మధురం కాదా, ఈ సౌఖ్యం, హృదయంలోన శాంతిని నిలిపే వింతగు లోకమిదే" అని అంటే శ్రీనివాస్ "నిత్య విషాదం ఈ లోకం, మాయే కాదా ఈ సౌఖ్యం, స్వప్నాలందే శాంతిని పొందే వింతగు లోకమిదే" అని పాడతారు. ఈ పాటకు ప్రత్యేక పరిమళాన్ని ఇచ్చేవి "స్పానిష్ ఫ్లెమెంకో" పద్ధతిని అమర్చబడిన సంగీతానుసరణ, అక్కడక్కడ ఆషాఢమేఘమాలికల్లో మెరిసే మెరుపుల్లా విరుపులు వినిపించే అకార్డియన్, ఈశ్వరి "లోకమిదే" అన్నచోట ఉన్న మైకమూ, వెనువెంటనే "బాంగో డ్రమ్స్" మీద మోహావ్రిక్త హృదయస్పందనలా వినవచ్చే దరువులు, తారాపథానికి తారాజువ్వలాగా ఎగసిపోయే ట్రంపెట్‌సోలో, మదిరాకాంత కౌగిలిలో మత్తెక్కి వినేవారికి సుందర సుందర కంఠంతో కైపెక్కిస్తున్న శ్రీనివాస్ గాత్రం.

మద్రాసులో "పెళ్లితాంబూలం" ప్రెస్‌షో వేయగా చూశాను. పై రెండు పాటలు నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. మరునాడే సరస్వతీ స్టోర్స్‌కి వెళ్లి కనుక్కుంటే తెలిసింది ఈ రెండు మాత్రమే రికార్డుగా రావని. ఇంత చక్కని సాహిత్య సంగీత మేళవింపులు నలుగురికి అందవని తెలిసి విచారించాను. వెంటనే వెళ్లి ఒక సుప్రసిద్ధ కవిగారిని అడిగాను. వారి పలుకుబడిని విక్రమ్ రంగాగారి దగ్గర ఉపయోగించి ఆరోజే ఆ పాటల "ట్రాక్స్" సరస్వతీ స్టోర్స్‌కి పంపమని. అంతకుముందు నేను వారికి పరిచితుడను కాకపోయినా అత్యవిధి వెంటనే అవని చేసిపెట్టారు. ఈనాడు ఆ పాటలను మనం ఆనందిస్తున్నామంటే వారి చలవే. ఇందుకు వారికి నేనూ, సంగీతప్రియులైన ప్రేక్షకలోకమూ కృతజ్ఞతా పుష్పాలతో నిత్యపూజ చేయాలి.

ఈ పాట గురించే వ్రాస్తూ, మొదటి సరాగమాలలో అనుకుంటాను, అనిసెట్టి సాహిత్యం మల్లెలపందిరిలా మణిదీపంలా మురుస్తూ మెరుస్తూ ఉందని వ్రాస్తే హితులూ, స్నేహితులూ అయిన ఒక (పిచ్చి తుగ్లక్ తరువాత అన్ని "పన్నులు" వేసిన) కవి నన్ను హేళన చేశారు. క్లబ్ డాన్సులను మల్లెల పందిళ్లతో, మణి దీపాలతో పోలుస్తారా, అంతగా పొగడాలని ఉంటే పచ్చ మెల్బాలాగ ఉందనో కుంకుం నడుములాగ ఉందనో వ్రాయకూడదా అని. నేను వ్రాసినది సాహిత్యం గురించేనన్నది వారు గుర్తించి ఉండరు. ఈ పాటను వింటే ఆ కవిగారు మనస్సు మార్చుకొని నాతో ఏకీభవిస్తారనే నమ్మకం నాకు ఉన్నది. ★

# న్యూఢిల్లీ లేఖ

7-వ పేజీ తరువాయి

రించాలి. సిన్హా, మిశ్రా, మొదలియార్, అయ్యంగార్, రెడ్డి, సేన్, గుప్త మొదలైన తోకలన్నీ ఆయా వ్యక్తుల కులాన్ని సూచిస్తాయి. మరొకసంగతి. ప్రతి కేంద్రమంత్రి తనదగ్గర పనిచేయడానికి స్వరాష్ట్రానికి చెందిన వ్యక్తులను తెచ్చుకుంటాడు. ఈవిధంగా ప్రతి మంత్రీ ప్రాంతీయతా భావానికి ఆలంబనం అవుతున్నాడు.

పార్లమెంటరీ కాంగ్రెసుపార్టీ ఉపనాయకత్వం కీచులాట ఇప్పుడు కొత్త రూపం ధరించింది. ఈ పదవి ఇప్పటికే ఆకర్షణ, హోదా కోల్పోయింది. లోక్‌సభలో శ్రీ ధేబర్ ఉప నాయకుడుగా ఎన్నికవుతారని లాబీ వర్గాలు వూహాగానం చేస్తున్నాయి.

ఉపనాయకుడు ప్రధానమంత్రి పరోక్షంలో ప్రధానమంత్రిగా వ్యవహరించే అవకాశం ఉన్నప్పుడు ఆ పదవి (ఉపనాయక పదవి) ఆకర్షణీయంగా ఉండేది. సర్దార్ పటేల్ వాస్తవానికి ఉప ప్రధానిగా పని చేశారు. మౌలానా ఆజాద్, పండిత పంత్ ఉపనాయకులు. వీరుభయులూ కూడా ప్రత్యక్షంగా ఉప ప్రధానులుగా వ్యవహరించేవారు.

పండిత పంత్ మరణానంతరం ఈ విషయానికి కొంత ప్రాధాన్యం లభించింది. "షాజహాన్ వ్యాధిగ్రస్తుడయ్యాడు; సింహాసనం కోసం అప్పుడే తగవులు ప్రారంభమయ్యాయి" అని లాబీలో గుసగుసలు వినవస్తున్నాయి. ఉపనాయకుడంటే ఈ సందర్భంలో 'సింహాసనానికి వారసుడు' అని అర్థంచెప్పుకోవాలి. శ్రీనెహ్రూ ఈ విషయంలో చాలా జాగ్రత్తగా ఉన్నారనే చెప్పవలసి ఉంది. కాంగ్రెసుపార్టీకి ఉపనాయకుణ్ణి ఎన్నుకోవడం ద్వారా ఉత్తరోత్తరా ప్రధానమంత్రిని ఎన్నుకునేహక్కు ప్రజలకులేకుండా చెయ్యటం ఆయనకు ఇష్టం లేదు. అందుకు ఆయనేంచేశారు? కాంగ్రెసు పార్టీ ఉపనాయకుడుగా ఎన్నికైనవ్యక్తికి తమ తరఫున వ్యవహరించే అధికారం ఉండదన్నారు. అంతేకాక ఇదివరకు మాదిరిగా ఒక్క ఉపనాయకుణ్ణికాక, లోక్‌సభకొకరిని, రాజ్యసభకు మరొకర్ని — మొత్తం ఇద్దర్ని — ఎన్నుకోవాలని పార్టీ నిశ్చయించింది. గతసంవత్సరాంతానికి కథ ఇంతవరకూవచ్చింది. ఉపనాయకులు మంత్రివర్గ సభ్యులై ఉండనవసరంలేదని ఈ ఏడు ప్రధానమంత్రి ప్రకటించారు.

* * *

రక్షణశాఖ పద్దులపై జరిగినచర్చ కొంత హుషారుగా సాగింది. ఈ చర్చలో ప్రధానాంశం ఏమంటే కమ్యూనిస్టువర్గం కోతతీర్మానాలు ప్రతిపాదించకపోవటం. ఈ ఏడు చర్చకు సమాధానం చెబుతూ శ్రీ కృష్ణమీనన్ వాడినభాష కమ్యూనిస్టు నాయకుడు శ్రీ ముఖర్జీకే ఆశ్చర్యం కలిగించింది. తమసీటులో కూర్చుని ఇదంతా వింటున్న ప్రధానమంత్రి ఇరుకునపడ్డారు. ★







ప్రతివారం ఆంధ్ర దేశమంతటా లక్షలమంది ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదివి ఆనందిస్తూ ఉంటారు. మీ స్థానిక ఏజెంటు ద్వారా చందాదారులయితే మీ కాపీ మీకు వారం వారం నిశ్చయంగా చేరగలదు.



# పొట్టి కథలు

## అలవాటు

ఇద్దరు వ్యక్తులు మొదటి తరగతి రైలుపెట్టెలో ప్రయాణం చేస్తున్నారు. పూర్వపరిచయం లేకపోయినా అవి ఇవీ మాట్లాడుకుంటున్నారు. ప్రసంగం గాలి, వెలుతురు ఆవశ్యకతమీందకు మళ్ళింది.

"రాత్రిపూట పడకగది తలుపులు తెరుచుకుని పడుకోవాలని సాధారణంగా నేను అందరికీ సలహా చెబుతూంటాను" అని ఒకడు చెప్పాడు.

"మీరు డాక్టరు అయిఉంటారని నా అభిప్రాయం" రెండవవాడు హేళన ధ్వనింపజేశాడు.

"అచ్చేలేదు! మనలోమాటగా అసలు సంగతి చెబుతున్నా... నేను దొంగని" మొదటివ్వాడు రహస్యంగా ఊదాడు.

ఎ. ఎస్. లక్ష్మీదేవి (గూడూరు)

*　　*　　*

రాత్రి రెండు గంటలైంది. హోటల్ నిశ్శబ్దంగా ఉంది. ఒక మూలమాత్రం ఓ పెద్దమనిషి కూర్చున్నవాడు కూర్చున్నట్టే నిద్రపోతున్నాడు.

"అతణ్ణి మీరు ఐదుసార్లు నిద్ర లేపుతుండగా నేను చూశాను. ఇంటికిపొమ్మనకపోయారా?" సర్వరు హోటల్ యజమానిని అడిగాడు.

"ఏం లాభంలేదు! నేను లేపినప్పుడల్లా బిల్లు అడిగి పుచ్చుకుని డబ్బు చెల్లిస్తున్నాడు" యజమాని నవ్వుతూ సమాధానం చెప్పాడు.★


Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1, Chief Editor ; S. Sambhu Prasad.

రోజంతా చల్లగా మరియు సువాసన వెదజల్లుతూ ఉండుటకు

## పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ వాడండి

ఋట్టూ శీతోష్ణస్థితి ఎలా వున్నా, రోజంతా
సువాసన వెదజల్లుతూ, తాజాగా ఉండుటకు
స్నానము చేసిన తరువాత పాండ్స్
డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను ఒళ్లంతా జల్లుకోండి!
నేదదేర్చే యీ పౌడరు ఎంతో మెత్తగా
ఉంటుంది. తేలికైన సువాసనను కలిగి
ఉంటుంది, బాగుగా చెమటను పీలుస్తుంది!
స్నానానంతరపు తాజాదనమును రోజంతా
పొందుటకు దీనిని వాడుటయే మంచిమార్గము!




చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఎ. లో స్థాపించబడినది)